


# రుచిగా
# చల్లగా
# తియ్యగా వుండే



## ఎక్స్‌ట్రా-స్ట్రాంగ్
## పెప్పరమింట్లు

9 పెప్పరమింట్లు ఉండే ప్యాకెట్
ఎంతో తక్కువ ధరకు లభిస్తాయి
మాధుర్యమైన ఆహ్లాదమునకు
ఆహ్లాదకరమైన మాధుర్యమునకు









everest/981/PP tel

# "నెరోలేక్ ప్లాస్టిక్ ఇమల్షన్ కంటికింపైన మెరిసే సమ ముగింపు గలిగించేది"

## అంటున్నది గుడ్ నెరొలాక్ పులి

నెరొలాక్ ప్లాస్టిక్ ఇమల్షన్ విశిష్టమైన పెయింట్ ఒక గంటలో ఆరిపోతుంది. కంటి కింపైన మెరిసే సమ ముగింపు గలది. నెరొలాక్ ప్లాస్టిక్ ఇమల్షన్ తెలుపులోను మరియు 6 ముఖ్య ప్రాథమిక రంగుల్లోను లభించుచున్నది. అయితే, నెరొలాక్ తెలుపు ఇమల్షన్ ప్రాథమిక ఆధారంతో దానిపైన నెరొటింట్ స్టైనర్స్ ఉపయోగించుట వల్ల మీరు కోరిన ఏ రంగునైనా పొందవచ్చును.

నెరొలాక్ ప్లాస్టిక్ ఇమల్షన్ విలంగా చాలా కాలం నిలుస్తుంది.

కొద్దిగా సబ్బు కలిపిన సౌమ్యమైన అతిచల్లని సబ్బు నీళ్లతో అప్పుడప్పుడు కడుగుచుండినయెడల నెరొలాక్ ప్లాస్టిక్ ఇమల్షన్ పెయింటు క్రొత్తగా కనిపించునట్లు మీరు కాపాడు కోవచ్చును.

గుడ్‌లాస్ నెరొలాక్ పెయింట్స్ లిమిటెడ్.
పోస్టు బాక్సు నం. 699,
ఫోర్బ్స్ బిల్డింగ్, హోమ్ స్ట్రీట్, బొంబై 1.









గుడ్‌లేస్ నెరోలేక్ పెయింట్లు–మీరు కొనగలిగే వాటిలో ఒకటో రకమైనవి

Interpub/GNP/14 Tel









# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి... రోజంతా దంతక్షయాన్ని నివారించండి!




DC.G.41 TL

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ ప్రకటించబడనటు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటే: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్ళు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ రుజావు ఉన్నది! ఎంతో చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్ళు తోముకొనుటకు పిల్లలు ఇష్టపడతారు!




శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్ళకు... ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్‌కంటె కాల్గేట్‌నే కొంటారు!



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

"చందమామ" లో చాలా కాలం క్రితం కొన్ని బుద్ధజాతక కథలు వరుసగా ప్రచురించాము. బుద్ధ కథలనూ, జాతకకథలనూ కొన్నిటిని చందమామలో తిరిగి ప్రచురించ నిశ్చయించాము. "దేవధర్మం" అన్నది జాతకకథ. ఇందులో రామాయణంలోని కైకేయి వరాలలాటి సన్నివేశమూ, భారతంలోని యక్ష ప్రశ్నలూ ఉండటం గమనించండి.

సంపుటి 48 జూన్ '71 సంచిక 6








సులభాః పురుషా లోకే సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా, శ్రోతా చ దుర్లభః 1

[ఇష్టమైన మాటలు చెప్పేవారు ఎందరైనా ఉంటారు. అప్రియమైన హితం చెప్పేవారూ, వినేవారూ దొరకటం కష్టం.]

య ద్దైవోపనతం దుఃఖం సుఖం తద్ధి రసాంతరం
నిర్వాణాయ తరుచ్ఛాయా త ప్తస్య హి విశేషతః 2

[దుఃఖం తరవాత వచ్చిన సుఖమే హాయిగా ఉంటుంది. ఎండలో తపించిన వాడికే చెట్టునీడలో ఉండే సుఖం తెలుస్తుంది.]

వహ్ని స్తస్య జలాయతే, జలనిధిః కుల్యాయతే, తత్క్షణాత్
మేరుః స్వల్పశిలాయతే, మృగపతిః సద్యః కురంగాయతే,
వ్యాలో మాల్యగుణాయతే, విషరసః పీయూషవర్షాయతే,
యస్యాంగేఖిల లోకవల్లభతమం శీలం సమున్మీలతి 3

[అందరూ మెచ్చుకునే శీలం కలవాడికి అగ్ని నీరులాటిది, మేరుపర్వతం రాతిముక్క లాటిది, సింహం జింకలాటిది, పాము పూలమాల లాటిది. విషం అమృతం లాటిది.]

మంచి - చెడూ



# చెల్లని పంతం

పెద్దమ్మా, చిన్నమ్మా అక్క చెల్లెళ్ళు. చిన్నమ్మకు ఎందరో భక్తులు. పెద్దమ్మను ఎవరూ కొలవరు, ఎవరూ పూజించరు. అందుకని పెద్దమ్మకు చెల్లెలంటే అసూయ.

ఒకనాడు శ్రీదేవి ఒక వంద రత్నాలను ఎంచుకుని, "ఇవి చాలు!" అని, వాటితో బయలుదేరబోతున్నది.

పెద్దమ్మ అది చూసి, "ఎక్కడికే బయలుదేరుతున్నావు? ఎవరికే ఆ రత్నాలు?" అంటూ శ్రీదేవికి ఎదురు వచ్చింది.

"వీటిని నువు తాకకే, అక్కా. ఒక బీదవాడు, పాపం, పస్తులుపడుతూ, నా కటాక్షం కోసం ఎదురు చూస్తున్నాడు. వాడికీ రత్నాలు ఇచ్చి వద్దామని బయలుదేరుతున్నాను," అన్నది శ్రీదేవి.

"నా చెయ్యి తగిలితే నీ రత్నాలు బొగ్గు లయిపోవులేవే! వాటిని ఇలాతే. నేనే వాటిని ఇచ్చి వస్తాను," అన్నది పెద్దమ్మ.

విధి లేక శ్రీదేవి ఆ రత్నాలను తన అక్కకు ఇచ్చింది. పెద్దమ్మ వాటిని ఒక లావుపాటి చేతి కర్రలో నింపి, శ్రీదేవి చెప్పిన సీనప్ప అనేవాడి ఇంటికి వచ్చింది.

సీనప్ప తెల్లవారి లేస్తూనే తన తలగడకు చేరబెట్టి ఒక చేతి కర్ర ఉండటం చూసి ఆశ్చర్యపడ్డాడు. "చేతికర్ర అవసరం ఇంకా నాకు కలగలేదే!" అనుకుంటూ సీనప్ప ఆ కర్ర తీసుకుని, చెరువుకు వెళ్ళాడు.

దారిలో ఎరిగిన కుర్రవాడొకడు కనిపించి, "ఇలాటి చేతి కర్ర ఎక్కడ దొరుకుతుందండీ? మా తాత చేతి కర్ర కొనుక్కు రమ్మని నాకు పావలా ఇచ్చాడు," అన్నాడు.

"కావలిస్తే దీన్నే తీసుకుపో," అని సీనప్ప ఆ కుర్రవాడి దగ్గిర పావలా కాసు తీసుకుని, తన చేతి కర్ర వాడికి ఇచ్చేశాడు. తరవాత పావలాకాసు చెరువు గట్టున పెట్టి, స్నానం కోసం చెరువులో దిగాడు.

జి. గురునాధరావు

అది చూసిన ఒక కొంటె కుర్రాడు ఆ పావలా సంగ్రహించి వెళ్ళిపోయాడు.

సీనప్ప స్నానం ముగించి, ఒడ్డుకు వచ్చి చూసుకుంటే పావలా కాసు లేదు. "ఎలా వచ్చిందో అలాగే పోయిందిలే," అనుకుని సీనప్ప తన యింటికి వెళ్ళిపోయాడు.

ఇదంతా కనిపెట్టుతూ ఉండిన శ్రీదేవి తన అక్కతో, "చూశావా? నేను చెబితే విన్నావు కావు. నీ చేతి మీదుగా ఇచ్చిన సొమ్ము ఆ పేదవాడికి దక్కకుండా పోయింది," అన్నది.

పెద్దమ్మకు కోపం వచ్చి, "నువ్వయితే ఏం చేసేదానివే?" అన్నది.

"నేను ఏం చేస్తానో ఇప్పుడే చూపిస్తాను," అన్నది శ్రీదేవి నవ్వుతూ.

ఈ లోపల మనవడు తెచ్చిన కర్ర తీసుకుని వాడి తాత, "ఈ కర్ర ఇంత బరువున్నదేమిరా? దీన్ని నేను మోయలేనే! దీన్ని ఎక్కడ తెచ్చావు?" అని అడిగాడు.

"సీనప్పగారి దగ్గిర పావలా ఇచ్చి తెచ్చాను, తాతా," అన్నాడు మనవడు.

"దీన్ని అతనికే తిరిగి ఇచ్చి, పావలా తీసుకుని, ఎక్కడన్నా తేలికగా ఉండే కర్ర తీసుకురారా!" అన్నాడు తాత.

కుర్రవాడు సీనప్ప దగ్గిరికి వచ్చి, "మా తాతకు ఈ కర్ర బరువుగా ఉన్నదిట. తిరిగి ఇచ్చెయ్యమన్నాడు," అన్నాడు.

సీనప్ప చేతి కర్ర తీసుకుంటూ, "నువ్విచ్చిన పావలా కాసు లేదు, నాయనా! రేపో మాపో రాగానే ఇస్తానని మీ తాతతో చెప్పు," అన్నాడు.

కుర్రాడు వెళ్ళాడో లేదో, ఒక పెద్ద మనిషి సీనప్ప దగ్గిరికి వచ్చి, పావలా ఇస్తూ, "మా వెధవ మీ పావలా తెచ్చాడుట," అంటూ వెళ్ళిపోయాడు. సీనప్ప ఆ పావలా తీసుకుపోయి తాతగారికిచ్చాడు.

ఇది చూసి పెద్దమ్మకు చాలా కోపం వచ్చింది. పేదవాణ్ణి చంపెయ్యాలని ఆమె నల్లతాచు రూపంలో ఆ రాత్రి సీనప్ప ఇంట ప్రవేశించింది. ఆ పామును చూడగానే సీనప్ప చేతికర్ర దాని మీదికి విసిరాడు, కాని కర్ర విరిగి రత్నాలు బయటపడ్డాయి.





# దేవధర్మం

చాలాకాలం క్రితం కాశీరాజుకు పట్టపురాణి యందు ఇద్దరు కొడుకులు కలిగారు. రాజు వారికి మహింసాసు డనీ, చంద్రకుమారు డనీ పేర్లు పెట్టాడు. మహింసాసుడే బోధి సత్వుడు. చంద్రకుమారుడు పసివాడుగా ఉండగానే పట్టపురాణి చనిపోయింది.

అప్పుడు రాజు మరొక భార్యను పెళ్లాడి, ఆమెను పట్టపురాణిని చేశాడు. ఆమె రాజుకు ప్రేమ పాత్రురాలుగానూ, అనుకూలవతి గానూ ఉంటూ, కాలక్రమాన తాను కూడా ఒక పిల్లవాణ్ణి కన్నది. వాడికి సూర్యకుమారు డని పేరు పెట్టారు. రాజు ఈ పుత్రుణ్ణి చూసి సంతోషించి, పట్టపురాణితో, "నీ కొడుక్కు ఏదైనా వరం ఇస్తాను," అన్నాడు.

"ఇప్పుడు కాదు, నాకు కోరాలనిపించి నప్పుడు వరం అడిగి పుచ్చుకుంటాను," అన్నది పట్టపురాణి.

కొంత కాలానికి సూర్యకుమారుడు యుక్తవయస్కుడయాడు. అప్పుడు పట్టపు రాణి రాజుతో, "నాకు కొడుకు పుట్టినప్పుడు వరం ఇస్తానన్నారు. ఇప్పుడా మాట చెల్లించి, నా కొడుక్కు రాజ్యం ఇయ్యండి," అన్నది.

"అగ్నిజ్వాలల లాగా ప్రకాశించే పెద్ద కొడుకులు ఇద్దరుండగా నీ కొడుక్కు రాజ్యం ఇవ్వటం నాకు సాధ్యం కాదు," అన్నాడు రాజు ఆమె కోరికను తోసిపుచ్చుతూ.

పట్టపురాణి తన పెద్ద కొడుకులకు హాని చేయవచ్చునని రాజుకు అనుమానం కలిగింది. ఆయన మహింసాసుణ్ణీ, చంద్రకుమారుణ్ణీ పిలిచి, "అబ్బాయిలూ, నేను సూర్యకుమారుడు పుట్టిన సమయంలో మీ పినతల్లికి వరం ఇస్తానన్నాను. ఆమె ఇప్పుడు రాజ్యం కోరుతున్నది. నేను ఆమెకు రాజ్యం ఇవ్వదలచలేదు. అయితే స్త్రీ బుద్ధి ప్రళయాంతకమైనది. ఆమె మీకు ఏదన్నా కీడు



చేయవచ్చు. అందుచేత మీరు వెంటనే అరణ్యాలకు వెళ్ళి, నేను కన్ను మూశాక తిరిగి వచ్చి, ఈ రాజ్యం ఏలుకోండి," అని చెప్పాడు.

ఆయన కన్నీరు కారుస్తూ తన ఇద్దరు కొడుకుల తలలూ ముద్దు పెట్టుకుని, వీడ్కోలు చెప్పాడు.

ఇదేమీ సూర్యకుమారుడు ఎరగడు. తన అన్నలు రాజభవనం దిగి ఎక్కడికో ప్రయాణం అవుతూ ఉండటం చూసి, అన్నలతోపాటు వెళ్ళాలనిపించి, తాను కూడా వారితో బయలుదేరాడు.

ముగ్గురు అన్నదమ్ములూ హిమాలయాల మీదికి వెళ్ళారు. బోధిసత్వుడు దారికి ఎడంగా ఉన్న ఒక చెట్టు కింద కూర్చుని సూర్యకుమారుడితో, "బాబూ, ఆ కనిపించే కొలనుకు వెళ్ళి, స్నానం చేసి, దాహం తీర్చుకుని, మా ఇద్దరికీ తాగటానికి తామరాకులతో నీరు పట్టుకురా," అన్నాడు.

ఆ కొలను ఒక జలరాక్షసుడైన యక్షుడిది. కుబేరుడు దాన్ని ఆ జలరాక్షసుడి కిచ్చి, దేవధర్మం ఎరిగిన వారిని విడిచిపుచ్చమనీ, అది తెలియనివాళ్ళు ఎవరైనా కొలనులో దిగితే వారిని భక్షించమనీ, కొలనులోకి దిగని వారి జోలికి పోవద్దనీ చెప్పాడు.

అది మొదలు ఆ యక్షుడు కొలనులో దిగిన ప్రతి మనిషినీ, "దేవధర్మం ఏమిటి?" అని అడిగి, చెప్పలేని వారిని భక్షిస్తూ వస్తున్నాడు. అందుచేత, సూర్యకుమారుడు కొలనులోకి దిగగానే ఆ యక్షుడు అతన్ని, "నీకు దేవధర్మం తెలుసునా?" అని అడిగాడు.

"ఆ, తెలుసు. దేవధర్మమంటే సూర్యచంద్రులు," అన్నాడు సూర్యకుమారుడు.

"నీకు దేవధర్మం తెలీదు," అని యక్షుడు సూర్యకుమారుణ్ణి తన నివాసానికి తీసుకుపోయి అక్కడ ఉంచాడు.

సూర్యకుమారుడు ఎంతకూ రాకపోవటం చూసి బోధిసత్వుడు చంద్రకుమారుణ్ణి కొలనుకు పంపాడు. యక్షుడు అతన్ని కూడా పట్టుకుని, దేవధర్మం ఏమిటి అని అడిగాడు.

దేవధర్మ మంటే నాలుగు దిశలూ అన్నాడు చంద్రకుమారుడు. "నీకు దేవధర్మం తెలీదు," అని చెప్పి, యక్షుడు అతన్ని కూడా తీసుకుపోయి తన నివాసంలో ఉంచాడు.

చంద్రకుమారుడు కూడా ఎంతకూ రాక పోయేసరికి బోధిసత్వుడు, ఏదో విపత్తు సంభవించి ఉంటుందనుకుని, తానే స్వయంగా బయలుదేరి కొలనుకు వచ్చాడు. ఇద్దరు మనుషులు కొలనులోకి దిగిన చిహ్నాలు కనిపించాయిగాని, అందులో నుంచి బయటికి వచ్చిన జాడ కనిపించ లేదు. "ఇందులో ఎవరో రాక్షసు డున్నాడు కాబోలు," అనుకుని బోధిసత్వుడు కత్తి దూసి చేత పట్టుకుని, యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డాడు.

అతను నీటిలోకి దిగక పోవటం చూసి జలరాక్షసుడైన యక్షుడు అటవికుడి రూపంలో అతని ముందుకు వచ్చి, "మహాశయా, నీటిలోకి దిగి, స్నానం చేసి, దప్పిక తీర్చుకోక, ఒడ్డున ఎందు కిలా నిలబడి ఉన్నారు?" అని అడిగాడు.

ఈ కొలనుకు అధిపతి అయిన యక్ష రాక్షసుడు ఈ మనిషే అయి ఉంటాడని బోధిసత్వుడికి అనుమానం కలిగింది. "నా తమ్ములను పట్టుకు పోయినది నువేనా?" అని అతను యక్షుణ్ణి అడిగాడు.



"అవును, వాళ్ళను పట్టుకుపోయింది, నేనే!" అన్నాడు యక్షుడు.

"ఎందుకు అలా చేశావు?" అని బోధిసత్వుడు అడిగాడు.

"ఈ కొలనులో దిగేవారు నాకు అధీనులవుతారు," అన్నాడు యక్షుడు.

"కొలనులో దిగిన ప్రతివాడూ నీకు లోబడవలసిందేనా?" అని బోధిసత్వుడు అడిగాడు.

"దేవధర్మం తెలిసిన వాళ్ళు తప్ప అందరూ నా అధీనంలో ఉంటారు," అన్నాడు యక్షుడు.

"నీకు దేవధర్మం కావాలంటే నేను చెప్పగలను," అన్నాడు బోధిసత్వుడు.

"అయితే చెప్పు. వింటాను." అన్నాడు యక్షుడు.

"అభిమానమూ, నిందా భయమూ, శుభ కర్మమూ, శాంతమూ గల సత్పురుషుడి ధర్మమే దేవధర్మం." అన్నాడు బోధి సత్వుడు.

యక్షుడు ఈ మాటకు తృప్తిపడి, బోధి సత్వుడికి స్నానమూ, భోజనమూ, పానమూ మొదలైన సత్కారాలు చేసి, "నాకు నీ పైన అనుగ్రహం కలిగింది. నీ తమ్ములలో ఒకణ్ణి నీకు తిరిగి ఇస్తాను. ఎవర్ని తీసుకురమ్మన్నావు?" అని అడిగాడు.

"నా చిన్న తమ్ముణ్ణి తీసుకురా." అన్నాడు బోధిసత్వుడు.

"పండితుడా, నీకు దేవధర్మం తెలునునే గాని, దాన్ని అమలుపరచటం తెలియదు," అన్నాడు యక్షుడు.

"అదేం?" అని బోధిసత్వుడు అడిగాడు.

"నీ తమ్ములలో పెద్దవాణ్ణి వదిలి చిన్నవాణ్ణి అడగటంలో పెద్దవాడికి గౌరవం లేకుండా చేస్తున్నావు," అన్నాడు యక్షుడు.

"యక్షుడా, నేను దేవధర్మాన్ని అచరించేవాణ్ణి కనకనే అలా కోరాను. నా చిన్న తమ్ముడి కారణంగానే నేను అరణ్యాలకు రావటం జరిగింది. ఇతని తల్లి మా తండ్రిని రాజ్యం అడిగింది. మా క్షేమం కోరి మా తండ్రి మమ్మల్ని వనానికి పంపాడు. ఇతను లేకుండా నేను మా దేశానికి పోయి, వాణ్ణి ఎవరో యక్షుడు మింగేశాడంటే ఎవరన్నా నమ్ముతారా?" అన్నాడు బోధిసత్వుడు.

"భేష్! నీకు దేవధర్మం తెలియటమే కాదు, అనుభవం కూడానూ," అని మెచ్చుకుని యక్షుడు చంద్రకుమారుణ్ణీ, సూర్యకుమారుణ్ణీ కూడా తీసుకు వచ్చి బోధిసత్వుడికి ఇచ్చాడు.

కొంతకాలం గడిచాక ముసలిరాజు చనిపోయినట్టు తెలిసింది. బోధిసత్వుడు తన తమ్ములిద్దరితోనూ తన దేశానికి తిరిగి వెళ్ళి, రాజ్యాభిషేకం చేసుకుని, తన తమ్ముడైన చంద్రకుమారుణ్ణి యువరాజుగానూ, సూర్యకుమారుణ్ణి సేనాపతిగానూ నియమించి, రాజ్యపాలన చేశాడు.





## 9

[ఖడ్గవర్మ దగ్గిరలేని సమయంలో, భైరవులు జీవదత్తుణ్ణీ, గ్రామాధికారి కూతుర్నీ పట్టుకున్నారు. ఖడ్గవర్మ గ్రామాధికారినీ, అతడి అనుచరులనూ వెంటబెట్టుకుని, వాళ్ళ వెన్నంటి పోయాడు. గణలింగేశ్వరుడు, జీవదత్తుణ్ణి కత్తితో పొడవబోయే సమయాన, పల్లెయువకు డొకడు పెంపుడు ఎలుగుబంటును అతడి మీదికి ఉసికొల్పాడు. తరవాత—]

ఎలుగుబంటి గాండ్రింపు వినబడగానే భైరవులందరూ ఒక్కసారి తలలుతిప్పి చూశారు. వాళ్ళకు పరుగు పరుగున వస్తున్న ఎలుగుబంటు కనిపించింది. గణలింగేశ్వరుడు నివ్వెరపడి ఓ తృటికాలం దాని కేసి చూసి పెద్ద గొంతుతో, "ఎలుగును శూలాలతో పొడిచి చంపండి! ఈ లోపల నేను వీడి గుండె చీల్చి భైరవుడికి రక్త తర్పణ చేస్తాను," అని కేక పెట్టాడు.

అతడు మాట ముగించే లోపలే, ఖడ్గవర్మ వదిలిన బాణం అతడి మణికట్టుకు బలంగా తగిలింది. గణలింగేశ్వరుడు "అబ్బా!" అంటూ బాధగా అరిచాడు. కత్తి అతడి పిడికిలి పట్టు నుంచి జారి కింద బడింది. ఖడ్గవర్మా, గ్రామస్తులూ రాళ్ళ చాటు నుంచి బయిటికి వచ్చారు.

"మోసం! అన్యాయం! దైవకార్యానికి విఘ్నం కలిగించే యీ నాస్తికమూకల్ని



చంపి, తలలు నరికి, శూలాలకు గుచ్చి పైకె త్తండి!'' అంటూ ఎగిరి గంతేశాడు గణ లింగేశ్వరుడు.

''పారిపోకుండా చచ్చుమాటల్తో కాలం వృథా చేస్తూ ప్రాణం మీదికి తెచ్చుకుంటు న్నాడు వీడు! చుట్టుముట్టి పట్టుకోండి,'' అని ఖడ్గవర్మ గ్రామస్తులకు హెచ్చరిక చేసి, జీవదత్తుడున్న రాతి కేసి పరిగెత్తాడు.

గణలింగేశ్వరుడు తన శిష్యులను గ్రామస్తుల మీద పడి చంపండని అజ్ఞా పిస్తూనే, తాను మాత్రం కొండ దిగువ కేసి పరిగెత్తసాగాడు. అది చూసిన శిష్యులు గురువును అనుసరించారు. ఎలుగుబంటు అలా పారిపోతున్న భైరవుల్లో ఒకడి తల పట్టుకోబోయింది. కాని, దాని చేతులకు వాడి నడుం దొరికింది. వాడు పెద్దగా ఓ చావు కేక పెట్టి కొండ అంచున బోర్లాపడి, ఎలుగుతోపాటు కింద వున్న పల్లంలోకి దొర్లుకుపోసాగాడు.

ఈ గలభా అంతా క్షణాల మీద జరిగి పోయింది. జీవదత్తుడూ, గ్రామాధికారి కూతురు భవానీ ఆశ్చర్యంలో మునిగి పోయారు. ఖడ్గవర్మ జీవదత్తుడి చేతి కట్లు విప్పుతూ, ''మనం అదృష్టవంతులం! నేను రావటం ఒక్క నిమిషం ఆలశ్యమై వుంటే, ఆ భైరవరాక్షసుడు కత్తితో నీ గుండెలు చీల్చి వుండేవాడు!'' అన్నాడు.

''ఖడ్గా, నువ్వు తప్పక సహాయం వస్తా వని అనుకుంటూనే వున్నాను! పారిపోతున్న ఆ దుర్మార్గులు భవానిని కూడా వెంట లాక్కుపోవటం లేదు గదా? ముందు ఆ పిల్ల సంగతి చూడు,'' అన్నాడు జీవ దత్తుడు లేచి నిలబడుతూ.

''తల్లీ భవానీ! నువ్వు కొండ అంచుకు పోబోకు. ఆ భైరవ పిశాచాల సంగతి మేం చూస్తాం!'' అని గ్రామాధికారి కేక పెట్టాడు.

అందరూ కొండ అంచు కేసి తలలు తిప్పారు. భవాని అంచున నిలబడి, అక్కడ చెల్లా చెదరుగా వున్న బండరాళ్ళను, కొండ దిగి పారిపోతున్న భైరవుల మీదికి తోస్తున్నది. భైరవులు ఆ రాళ్ల దెబ్బలను తప్పుకుంటూ

వేగంగా కొండ దిగి, దాపుల నున్న అరణ్య వృక్షాల కేసి పారిపోజూస్తున్నారు. పల్లె యువకుడి ఎలుగుబంటు, భైరవుడితోపాటు కొండ దిగువకు దొర్లుకుపోతూ మధ్య మధ్య నోటితో వాడి తల పట్టుకునేందుకు ప్రయత్నిస్తున్నది.

"నా ఎలుగుబంటును భైరవుడు చంపేలా వున్నాడు!" అంటూ పల్లెయువకుడు గబగబా కొండ దిగువకు పరిగెత్తసాగాడు. అతడితోపాటు మరి కొందరు గ్రామస్తులు కొండ దిగేందుకు బయలుదేరారు. వాళ్ళ ఉద్దేశం వెంటబడి తరిమి భైరవులను పట్టుకోవాలని.

ఖడ్గవర్మ వాళ్ళను ఆపి, గ్రామాధికారితో, "ఆ భైరవముఠా అంత సులభంగా మీకు దొరకదు. వాళ్ళొకసారి ఆ చెట్లలోకి పోయింతరవాత, ఒక పట్టాన అందరు. పోయే వాళ్ళను పోనివ్వండి. ఇక ముందు ఆ దుర్మార్గులు మీ గ్రామ ప్రాంతాలకు రాకుండా అవసరం అయిన కట్టుదిట్టాలు చేసుకోండి," అన్నాడు.

భవాని తన తండ్రి పక్కకు వచ్చి నిలబడి, "ఆ దుర్మార్గుల్లో ఒక్కగా నొక్కడైనా దొరక్కుండా పారిపోయాడు. కనీసం ఒక్కడైనా దొరికి వున్నట్టయితే, లాక్కుపోయి గొంతుకు ఉరి వేసి గ్రామ మధ్యంలో వున్న చెట్టుకొమ్మకు వెల్లాడ దీసేపని," అన్నది కోపంగా.

"వాళ్ళపాపాన వాళ్ళు పోతారు. నువ్వు ప్రాణాలతో దొరికావ్, తల్లీ! అంతేచాలు,"





అన్నాడు గ్రామాధికారి కుమార్తెను బుజ్జగిస్తూ.

గణకుడు, ఖడ్గ జీవదత్తుల కేసి కళ్లింత చేసుకుని చూస్తూ, ''మీ రిద్దరూ మహా వీరులు. సందేహం లేదు. మీ సాహసం సంగతి రాజుగారికి కబురంపి, మంచి బహుమానం వచ్చేలా చూస్తాం. మా వెంట గ్రామానికి రండి!'' అన్నాడు.

''మీ గ్రామానికీ, రాజుగారి బహుమానానికీ ఒక నమస్కారం. మా దారిన మమ్మల్ని పోనివ్వండి, అంతేచాలు!'' అన్నాడు జీవదత్తుడు.

''మా గ్రామం వచ్చి, మా ఆతిథ్యం స్వీకరించకుండానే వెళతారా? అన్యాయం. మీరు నా రక్షణ కోసం పడినశ్రమకు కృతజ్ఞత ఎలా చెప్పుకోవటం?'' అన్నది భవాని.

''మేము కొద్ది కాలంలో తిరిగి మీ రాజ్యానికి వచ్చి, పద్మపుర రాజుగారి దర్శనం చేసుకోవలసి వున్నది. ఆ సమయంలో మీ గ్రామానికి వచ్చి, కొన్నాళ్ళపాటు మీకు అతిథులుగా వుంటాం,'' అన్నాడు జీవదత్తుడు.

ఆ మాటలకు భవాని ఏదో జవాబు చెప్పబోయేంతలో కొండ కింది పల్లపు ప్రాంతాన్నుంచి పల్లెయువకుడు, ''నా ఎలుగుబంటు భైరవుణ్ణి చంపింది!'' అంటూ ఉత్సాహంగా కేక పెట్టాడు.

అందరూ అటు కేసి చూశారు. ముందు ఎలుగుబంటు మిట్ట ఎక్కుతున్నది. దాని నడుం ఒక చేత్తో పట్టుకుని, రెండవ చేత్తో చచ్చిన భైరవుడి కాలొకటి పట్టుకుని, వాణ్ణి యీడ్చుకుంటూ పల్లెయువకుడు కొండ ఎక్కుతున్నాడు.

''ఆ శవాన్ని అక్కడే ఒదిలిరా. దాన్ని ఇక్కడిదాకా యీడ్చుకురావటం ఎందుకు?'' అన్నాడు ఖడ్గవర్మ పల్లెయువకుడితో.

గణకుడు ఏదో రహస్యం చెపుతున్నవాడిలా ఖడ్గ జీవదత్తుల కేసి మెడ చాచి, ''ఆ కుర్ర వెధవ, మా గ్రామాధికారి మేనల్లుడు. భవానిని వాడికే యివ్వాలనుకుంటున్నారు. బహుశా వచ్చే ఏడు పెళ్ళి

జరిగిపోతుంది. అందుకే వాడికి భైరవు లంటే అంత కోపం,'' అన్నాడు.

''అదా సంగతి!'' అంటూ జీవదత్తుడు భవాని కేసి నవ్వుతూ చూస్తూ, ''భవానీ! బహుశా మేం నీ పెళ్లి ముహూర్తానికి ముందే, మీ గ్రామానికి తిరిగి వస్తాం. నువ్వు ఎలుగ్గొడ్ల లాంటి భైరవుల్ని అదరగొట్టావ్. కాబోయే నీ భర్త ఎలుగుబంటునే మచ్చిక చేశాడు,'' అన్నాడు.

ఆ మాటకు భవాని సిగ్గుపడుతూ, తన తండ్రి చాటుకు తప్పుకున్నది. ఇంతలో పల్లెయువకుడు ఎలుగుబంటుతో సహా కొండ అంచుకు వచ్చాడు. అతణ్ణి చూస్తూనే గ్రామాధికారి కోపంగా, ''ప్రాణాలతో వున్న భైరవుణ్ణి పట్టుకొస్తే సంతోషించేవాళ్ళం. ఈ చచ్చిన పీనుగని యిక్కడికి లాక్కొచ్చా వెందుకు?'' అంటూ పోయి, శవాన్ని కాలితో గట్టిగా ఒక తన్ను తన్నాడు. ఆ దెబ్బకు శవం కొండ అంచు నుంచి పల్లానికి దొర్లుకుంటూ పోయింది.

జీవదత్తుడు గ్రామాధికారితో, ''ఇక మాకు సెలవు. క్షేమంగా గ్రామానికి తిరిగి పొండి. దారిలో ఎక్కడైనా భైరవముఠా పొంచి వుండి దెబ్బతీయాలని చూస్తారేమో, తగు జాగ్రత్తలో వుండండి!'' అన్నాడు.

గ్రామస్తులందరూ ఖడ్గ జీవదత్తులకు నమస్కారాలు చేశారు. భవాని ముందుకు




వచ్చి వాళ్లిద్దరికీ తల వంచి నమస్కరించింది. జీవదత్తుడు ఆమెను ఆశీర్వదించి, కొండ దిగేందుకు భైరవులు పారిపోయిన వైపుకు కాక మరొక వైపుకు ఖడ్గవర్మతో బయలుదేరారు.

వాళ్ళిద్దరూ ఒక నూరడుగుల దూరం నడిచీ నడవక ముందే గణకుడు వెనక నుంచి పరిగెత్తుకుంటూ వాళ్ళ దగ్గిరకు వచ్చి, ''మరేం అనుకోకండి, బాబులూ! మీలో వీరభద్రుడెవరు? రామభద్రుడెవరు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఖడ్గవర్మ కోపంగా ఏదో జవాబివ్వబోయేంతలో జీవదత్తుడు అతణ్ణి వారించి, ''గణకమహాశయా! మీరు ఆ వీర




భద్రరామభద్రుల సంగతి మరిచిపొండి. ఆ మహేంద్రనగరం రాజు కొడుకూ, వాడి మిత్రుల గొడవ మీ మనస్సుకూ, శరీరానికూడా హాని కలిగిస్తుంది. మేం వీరభద్రులం రామభద్రులం కాదు, సరా!" అన్నాడు.

గణకుడు వాళ్ళకు మరోసారి నమస్కారం చేసి, ముఖం యింత చేసుకుని వెనుదిరిగి పోయాడు. ఖడ్గ జీవదత్తులు మిట్ట పల్లాలుగా వున్న కొండను ఎంతో శ్రమకోర్చి దిగి, ఓ గంట తరవాత దాని పాదంలో వున్న అరణ్యాన్ని చేరారు. ఆ అరణ్యం రెండు ఎత్తయిన కొండల మధ్య వున్నది. అక్కడ నర సంచారం వున్న సూచనలు లేవు. ఎక్కడా వాళ్ళకు కాలిబాట లాంటిది కనిపించలేదు. క్రూరమృగాల కాళ్ళ గుర్తులు మాత్రం అంతటా కనిపించాయి.

"ఖడ్గా, ఇది చాలా యిరుకైన లోయలా వున్నది. మనం ఎదురుగా కనబడే ఆ కొండను సూర్యాస్తమయం లోపల దాటి పోగలమా అన్న అనుమానం నాకు కలుగుతున్నది," అన్నాడు జీవదత్తుడు.

"అంత ఎత్తు కొండ ఎక్కకుండా, దాన్ని దాటేందుకు ఎక్కడైనా సొరంగ మార్గాలున్నవేమో చూద్దాం!" అన్నాడు ఖడ్గవర్మ.

ఆ తరవాత యిద్దరూ ఆకాశాన్నంటుతున్నట్టున్న పెద్ద వృక్షాల కిందుగా కొండకేసి నడవసాగారు. అలా వాళ్ళు పదీ పదిహేను నిమిషాలు నడిచేసరికి, ఒక నూరడుగుల ముందు ఏదో ప్రాణి నడుస్తున్న సూచనగా ఎండుటాకులు టపటప మంటూ శబ్దం చేసినై.

జీవదత్తుడు చప్పున ఆగి, "ఖడ్గా, ఎవరా నడిచేది? మనిషా? మృగమా?" అన్నాడు.

ఖడ్గవర్మ నిశ్శబ్దంగా చెట్లచాటుగా కొంచెం ముందుకుపోయి, ఆ శబ్దం వస్తున్న వైపుకు చూశాడు. అక్కడ అజానుబాహుడైన యువకు డొకడు భుజాన గండ్రగొడ్డలి పెట్టుకుని, పదీ పన్నెండడుగుల లావు గల ఒక చెట్టుబోదె చుట్టూ పహరా తిరుగుతున్నాడు.

ఖడ్గవర్మకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఇన్ని మహా వృక్షాలున్న కీ కారణ్యంలో ఒక్కగా నొక్క చెట్టుకు యీ కాపలా ఏమిటనిపించిం దతడికి. అతడు తల తిప్పి తన కేసి వస్తున్న జీవదత్తుడికి, నిశ్శబ్దంగా రమ్మని సౌంజ్ఞ చేశాడు. జీవదత్తుడు ఖడ్గ వర్మ దగ్గిరకు వచ్చి, చెట్టు నానుకుని నిల బడి పహరా యువకుణ్ణి చూశాడు.

"వీడేదో రాజుగారి ఖజానాను కాపలా కాస్తున్నట్టు, యీ నట్టడవిలో చెట్టుకు పహరాయిస్తున్నాడేమిటి? వాడి ఖర్మకు వాణ్ణి ఒదిలి మన దారిన మనం పోదామా?" అన్నాడు జీవదత్తుడు.

"అలా కాదు. ఈ వింత ఏమిటో తెలుసు కుని పోదాం. లేకపోతే యీ వింతక్కారణం ఏమైవుండేదా అని బతికున్నన్నాళ్ళు ఆశ్చ ర్యంతో, సంశయంతో బాధ పడవలసి వస్తుంది," అన్నాడు ఖడ్గవర్మ.

"సరే. నువ్వు కాస్త పక్కగా పోయి, ఒక చుట్టు తిరిగి పహరావాడి చెట్టుకు ఆ వైపున నిలబడు. నేను సరాసరి వాణ్ణి యిటు నుంచి పోయి కలుసుకుంటాను," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ బయలుదేరి ఒకటి రెండు నిమిషాల్లో చెట్టుకు అవతలి వైపు చేరి, ఒక చెట్టు చాటున కత్తి దూసి నిలబడ్డాడు. రాలి చెట్ల కింద పోగుగా పడిన ఎండుటాకుల్ని టపటప మని తొక్కుతూ జీవదత్తుడు యువకుడి కేసి నడిచాడు. ఆ శబ్దం వింటూనే యువకుడు తల తిప్పి తనను



సమీపిస్తున్న జీవదత్తుణ్ణి చూసి, "ఆగు! ఎవరు నువ్వు? యిక్కడ ఏం పని?" అని అడిగాడు గుర్రుమంటూ.

"నే నెవరో చెప్పినా నీకు తెలియదు కనక ఆ సంగతి వదిలేద్దాం! ఇక పని సంగతి; ముందు నువ్వు ఆ చెట్టుకు ప్రద క్షిణం మీద ప్రదక్షిణం ఎందుకు చేస్తు న్నావో చెపితే, తరవాత నే వచ్చిన పని చెపు తాను," అన్నాడు జీవదత్తుడు.

"ఇది చెట్టు కాదు — బావగారి కోట బురుజు! ఇక్కణ్ణించి కొత్త వాళ్లెవరూ ఆయన రాజ్యంలోకి ప్రవేశించకుండా కాపలా కాస్తున్నాను," అన్నాడు యువకుడు గండ్రగొడ్డలి అంచును వేళ్ళతో తాకి చూస్తూ.

"ఏమనుకోకు, యిదంతా ఏదో తలతిక్క వ్యవహారంగా వుంది. నువ్వు యిక్కడ పహరా తిరక్కపోతే, యిక్కడ ఏదో కోట బురుజు వున్నదన్న అనుమానమే ఎవరికీ కలగదు. అరణ్యంలో ఎన్ని చెట్లు లేవు; అలాంటిదే నువ్వు పహరా యిచ్చే చెట్టు కూడా. కాని, నువ్వు గొడ్డలి భుజాన పెట్టి తిరుగుతూ ఆ రహస్యాన్ని నలుగురికీ చెప్పే స్తున్నావు," అన్నాడు జీవదత్తుడు.

"అట్టే వాగక యిక్కణ్ణించి కదులు. ఊఁ పో!" అంటూ యువకుడు గొడ్డలి ఎత్తి జీవదత్తుడి కేసి ఒక అడుగు వేశాడు.

జీవదత్తుడు నవ్వుతూ, "నేనైతే పోతాను, సరే. నీ వెనక కత్తి దూసి ముందు కొస్తున్న పెద్ద మనిషి మాటేమిటి?" అన్నాడు.

యువకుడు చప్పున తల తిప్పి చూశాడు. ఖడ్గవర్మ అతడికి అయిదారడుగుల దూరంలో కత్తి ఝళిపిస్తూ నిలబడి, "నువ్వు పరశురాముడి శిష్యుణ్ణనుకుంటు న్నావా ఏం? ముందు ఆ గండ్రగొడ్డల్ని భుజాన వేలాడ వేసుకుని, చెట్టుబోదె కోటబురుజు ఎలా అవుతుందో, ఆ రహస్యం చెప్పు!" అన్నాడు.

యువకుడు తల తిప్పి యీసారి జీవ దత్తుడి కేసి చూశాడు. జీవదత్తుడు అతడికి రెండు మూడడుగుల దూరంలో దండం ఎత్తిపట్టుకుని నిలబడి వున్నాడు.

—(ఇంకా వుంది)





# సాముద్రికం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భవిష్యత్తులో మంచి యోగం ఉందని తెలిసినవాడు సాహసించి ఎలాటి విజయాలనైనా సాధించగలడు. ఇందుకు నిదర్శనంగా నీకు కేదారుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

'ఒక చిన్న రాజ్యంలో ఒక సామాన్య కుటుంబంలో కేదారు డనే యువకు డుండేవాడు. కుర్రవాడు స్ఫురద్రూపి, మంచి తెలివితేటలు గలవాడూనూ. కాని అతనికి ఏ పనియందూ ఆసక్తి లేదు; ఎప్పుడూ ఏవో పగటికలలు కంటూ ఉండేవాడు.

కేదారుణ్ణి గురించి అతని తండ్రికి పెద్ద విచారం పట్టుకున్నది. నిక్షేపమంటి కుర్ర

## బేతాళ కథలు



వాడు ఎందునా రాణించకుండా పోతాడను కుని, తన విచారాన్ని ఒక మిత్రుడితో చెప్పాడు. ఆ మిత్రుడు పేరు ప్రతిష్ఠలు గల పండితుడు. ఆయన ఒకనాడు కేదారుడి ఇంటికి వచ్చి, కేదారుడితో కొంతసేపు అదీ ఇదీ మాట్లాడి, "చూడు, బాబూ! నీకు జీవితంలో గల ప్రగాఢమైన కోరిక ఏమిటి?" అని అడిగాడు.

దానికి కేదారుడు, "బాబుగారూ, నాకు చిన్న చిన్న కోరికలేమీ లేవు. నా కున్నదల్లా ఒకే కోరిక. మన రాజుగారి కుమార్తె భూలోకరంభ అని చెబుతారు; ఆమెను పెళ్ళాడాలని నా కోరిక. రాజుగారికి పుత్ర సంతానం లేదు గనక, ఆమెను పెళ్ళాడే వాడు రాజుగారి అనంతరం రాజ్యం కూడా ఏలుతాడు. కాని నాది గొంతెమ్మ కోరికే. అది సఫలం కావటం సాధ్యం కాదు," అంటూ ఒక నిట్టూర్పు విడిచాడు.

పండితుడు, "అలా ఎందు కనుకోవాలి? ఏదీ, నీ చెయ్యి ఇయ్యి, రేఖలు చూస్తాను," అన్నాడు.

కేదారుడు అయనకు తన చెయ్యి చూపాడు. పండితుడు దాన్ని చాలాసేపు పరీక్షించి, "నీ కోరిక గొంతెమ్మ కోరిక కాదు, నాయనా! నీకు రాజయోగం ఉన్నది. నువు రాజకుమార్తెను తప్పక పెళ్ళాడ తావు. రాజువు అవుతావు," అన్నాడు.

పండితుడి మాటలు వింటూనే, కేదారుడు ఉత్సాహంతో, "అలా అయితే నేను రాజ కుమార్తెను కలుసుకుని నన్ను పెళ్ళాడ మని అడుగుతాను," అన్నాడు.

పండితుడు నవ్వి, "పిచ్చివాడా, ఘన మైన పనులు అంత తేలికగా సాధ్యపడ తాయా? నీకు రాజకుమార్తె దర్శనం కూడా దొరకదు. దేనికి తగ్గ కృషి దానికి జరగాలి. ముందు నువు రాజుగారి కొలువులో చేరు. క్రమంగా ఆయన విశ్వాసానికి పాత్రుడివై, ఆయనకు సన్నిహితుడివి కావాలి. ఆ తర వాత రాజకుమార్తె మనసును ఎంతో శ్రమ పడి నీ కేసి తిప్పుకోవాలి. ఎన్నో అడ్డంకు లను దాటితేనేగాని నువు రాజకుమార్తె

మెడలో మూడు ముళ్ళూ వెయ్యలేవు. అందుచేత తొందరపడకు. ఎంతో ఓర్పూ, పట్టుదలా చూపి, నీకు రాసి పెట్టి ఉన్న యోగాన్ని సాధించుకో. విజయం తప్పక లభిస్తుంది,'' అన్నాడు పండితుడు.

ఈ మాటలు విన్నాక కేదారుడిలో పెద్ద మార్పు కలిగింది. ఎప్పుడూ మన్నుతిన్న పాములా ఉండేవాడు కాస్తా చురుకుగా తయారయాడు. అతను రాజుగారి దర్శనం చేసుకుని, తనకు ఉద్యోగం ఇవ్వమని అడిగాడు. అతన్ని చూసి రాజుగారు ముచ్చటపడి రాజభవనంలోనే ఒక ఉద్యోగం ఇచ్చాడు.



సాధ్యమైనంత త్వరగా రాజకుమార్తెను పెళ్లాడాలన్న లక్ష్యంతో కేదారుడు తన విధులను ఎంతో శ్రద్ధతో నిర్వర్తించుతూ వచ్చాడు. రాజుగారికి అతని మీద మంచి అభిప్రాయం ఏర్పడింది. ఆ రాజభవనం తనది కాబోతుందనే దృఢ విశ్వాసం ఉండటం చేత, అక్కడ జరిగేదంతా తనకు సంబంధించినదే నన్నట్టుగా కేదారుడు ప్రవర్తించేవాడు. ఏ విషయంలో ఏ లోపం జరిగినా సహించేవాడు కాడు. అవసరమైతే తన కన్న పెద్ద పదవులలో ఉన్న వారిని సైతం విమర్శించేవాడు. ఈ కారణంగా రాజుగారికీ, అంతఃపుర స్త్రీలకూ కూడా అతనంటే పూర్తి నమ్మకం ఏర్పడింది.

త్వరలోనే రాజుగారికీ, రాణీగారికీ కేదారుడు అంతరంగిక సలహాదారు అయిపోయాడు. రాజకుమార్తెకు గల ప్రతి చిన్న అవసరాన్నీ అతను తీర్చేవాడు. అతను విశ్వాసపాత్రుడే గాక, అందగాడూ, తెలివి గల వాడూ కూడా కావటం చేత రాజకుమార్తెకు క్రమంగా అతని మీద అనురాగం కూడా పుట్టుకు రాసాగింది. అతనికి తన సమస్యలు చెప్పి, అతని సలహా తెలుసుకోవటం ఆమెకు ఎంతో తృప్తిని ఇచ్చేది.

రాజకుమార్తెకు వివాహం తలపెట్టి అనేక సంబంధాలు ఆలోచించారు. కాని ఆమె మనసుకు వాళ్ళందరి కన్నా కేదారుడే యోగ్యుడనిపించాడు. ఆమె కేదారుణ్ణి



పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నదని తెలియగానే రాజు అభ్యంతరం చెప్పక వారిద్దరికీ పెళ్ళి చేసేశాడు. ఆ భార్యాభర్తల అన్యోన్యం చూసి అందరూ రాజుగారి నిర్ణయాన్ని అభినందించారు.

కేదారుడు ఇప్పుడు రాచకార్యాలన్నీ మామగారి సహాయంతో నేర్చుకోసాగాడు. అందులో కూడా అతను ఎంతో శ్రద్ధాసక్తులు కనబరిచి, రాజుగారికే సలహాలిచ్చే స్థితికి వచ్చాడు.

కొంతకాలానికి ముసలి రాజు చనిపోయాడు. కేదారుడికి రాజ్యాభిషేకం జరిగింది. కేదారుడు కన్న కలలు ఫలించాయి. అతనికి పూర్తిగా సంతృప్తి కలిగింది.

అయితే ఈ సంతృప్తి ఎంతో కాలం నిలవలేదు. సుక్షత్రియుడు కానివాడు తమకు సాటి వాడయ్యాడని ఆగ్రహించి, పొరుగున ఉన్న రాజు లిద్దరు ఏకమై, కేదారుడి రాజ్యం మీదికి దండెత్తి వచ్చారు.

కేదారుడికి భయం వేసింది. శత్రువులతో ఏదో విధంగా సంధి చేసుకుని, వారికి సామంతుడుగా ఉండిపోతే తనకు వచ్చిన నష్టమేమిటని అతను అనుకున్నాడు.

ఇంతలో అతనికి తన తండ్రి స్నేహితుడైన పండితుడు గుర్తు వచ్చాడు. కేదారుడు ఆయనను సగౌరవంగా తన వద్దకు పిలిపించి, "బాబుగారూ, మీరు ఒకప్పుడు నా చెయ్యి చూసి చెప్పినది అక్షరాలా నిజమయింది. ఇప్పుడు నాకు యుద్ధం దాపరించింది. మరొకసారి నా చెయ్యి చూసి, నేనీ యుద్ధంలో గెలుస్తానో, ఓడిపోతానో చెప్పండి," అంటూ తన చెయ్యి ఆయనకు చూపాడు.

పండితుడు నవ్వి, "పిచ్చివాడా, నాకు నిజంగా సాముద్రికం వచ్చుననుకున్నావా? రాదు!" అన్నాడు.

కేదారుడు నిర్ఘాంతపోయి, "మీ రానాడు నిజంగా నా చేతిలో రాజయోగమూ, రాజకుమార్తెతో పెళ్ళీ చూడనేలేదా?" అన్నాడు.

"లేదు నాయనా! అదంతా వట్టి నటన, మోసం!" అన్నాడు పండితుడు.

కేదారుడు మరేమీమాట్లాడక పండితుడికి అంతులేని కానుక లిచ్చి పంపేసి, యుద్ధ సన్నాహాలు చేసి, తన శత్రువులను చిత్తుగా ఓడించాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. పండితుడు తనకు హస్తసాముద్రికం తెలిసినట్టు ఎందుకు బొంకాడు? కేదారుడు తాను రాజకుమార్తెను పెళ్ళాడి నప్పుడూ, రాజయినప్పుడూ కూడా ఆ పండితుణ్ణి సన్మానించక, ఆయన తనతో చెప్పిన దంతా వట్టిమాటలని తెలిసినాక ఎందుకు ఘనంగా సత్కరించాడు? శత్రువులతో యుద్ధం చెయ్యడానికి జంకినవాడు ఏ ధైర్యంతో యుద్ధ సన్నాహం చేసి, శత్రువులను జయించగలిగాడు? ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కేదారుడు పగటికలలు కంటూ కూర్చోకుండా, అతన్ని ఏదైనా చెయ్యటానికి ప్రేరేపించటానికి గాను పండితుడు సాముద్రికం వచ్చినట్టు నటించాడు. కేదారుడి గాఢమైన కోరిక ఏమిటో ముందుగా తెలుసుకుని, ఆ కోరిక సఫలమయే గీత చేతిలో ఉన్నదన్నాడు. ఆ ప్రేరణతోనే కేదారుడు కృషి ఆరంభించాడు. ఆ కృషి నిజంగా సఫలమవుతుందని పండితుడు అనుకుని ఉండడు. అది సఫలం కావటం నిజానికి కేదారుడి ప్రయత్న బలమే. ఆ పండితుడు తనకు సాముద్రికం రాదని చెప్పేదాకా కేదారుడు తన చేతి గీతలనే నమ్ముకున్నాడు. అందుకే అతను యుద్ధం చెయ్యటానికి ఇష్టపడలేదు. కాని, తాను రాజకుమార్తెను పెళ్ళాడటమూ, రాజు కావటమూ తన కృషి ఫలితమే అని తెలిసినాక, కేదారుడికి ఆ పండితుడు చేసిన సహాయం అర్థమయింది. అందుకే ఆయనను సత్కరించాడు. తన ప్రయత్నంలో అతనికి విశ్వాసం ఏర్పడింది గనక యుద్ధసన్నాహం చేసి విజయం సాధించాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# గతి తప్పని గ్రహాలు

వజ్రగిరి నగరాన్ని ఏలే వజ్రపాలుడు చక్రవర్తి కావాలన్న కోరికతో ఎన్నో యుద్ధాలు చేసి, ఎంతో రక్తపాతం కలిగించి, అనేక రాజ్యాలను లోబరచుకుని, చక్రవర్తి ననిపించుకున్నాడు.

అయితే వజ్రపాలుడి రాజ్యదాహం అంతకంతకూ పెరిగిందే గాని ఏంతమాత్రమూ తగ్గలేదు. ఇంకా జయించటానికి ఎన్నో దేశాలున్నాయి. సాధ్యమైతే ప్రపంచాన్నంతా జయించవచ్చు.

వజ్రపాలుడికి ఒకే ఒక కూతురున్నది. ఆమె పేరు పూర్ణరేఖ. ఆమె విద్యావివేకాలు గలది. తండ్రికి గల రాజ్యదాహం ఆమెకు ఎంత మాత్రమూ నచ్చలేదు. ఎప్పటి కప్పుడామె, తన తండ్రి ఇక యుద్ధాలు విరమిస్తాడనుకుంటూ వచ్చింది. కాని, రాజు ఒక యుద్ధం ముగియగానే మరొక యుద్ధానికి సన్నాహాలు ప్రారంభిస్తున్నాడు.

ఒక రోజు వజ్రపాలుడు చీకటి పడినాక తన కుమార్తె కోసం కబురు చేస్తే, ఆమె ఉద్యానంలో ఉన్నట్టు తెలిసింది. రాజు తోటకు వెళ్ళి, "ఈ చీకట్లో ఇక్కడ ఏం చేస్తున్నావమ్మా ?" అని పూర్ణరేఖను అడిగాడు.

"ఆకాశం చూస్తున్నాను," అన్నది పూర్ణరేఖ.

"ఆకాశంలో చూడటానికేమున్నది ?" అన్నాడు రాజు.

"ఇంత ఆకాశం విహరించటానికి ఉండగా గ్రహాలు రాశి చక్రాన్నే అంటి పెట్టుకుని ఎందుకు తిరుగుతాయా అని, చక్రవర్తి కూతురైన నేను ఆశ్చర్యపడుతున్నాను," అన్నది పూర్ణరేఖ.

వజ్రపాలుడికి ఆ మాట చురుక్కున తగిలింది. అతను మరి యుద్ధాలు చెయ్యలేదు.

—ఎం. మంజురాణి.





# తరగని సంపద

పూర్వం బాగ్దాదు నగరంలో ఖలీఫాగా ఉండిన హరూనల్‌రషీద్ అన్ని విధాలా యోగ్యుడే గాని, తనను మించిన సంపద ప్రపంచంలో మరెవరికీ లేదన్న అహంకారం ఆయనలో బలంగా ఉండేది; తన కన్న ధారాళంగా దానాలు చేసే వాడెవడూ లేడనుకునేవాడు. ఈ విషయం ఆయన తరుచుగా గొప్పలు చెప్పుకునేవాడు.

ఒకరోజు ఖలీఫా మితిమించి తన దాతృత్వాన్ని పొగడుకుంటూ ఉండటం చూసి భరించలేక, వజీరైన జఫర్ ఆయనకు కనువిప్పు కలిగించ నిశ్చయించి, "హుజూర్, మానవులు అల్లా సమక్షంలో అణకువగా ఉండటం కన్న గర్వించదగినది మరేదీ లేదు. సమస్త సంపదలూ, సద్బుద్ధీ కూడా దైవం ప్రసాదించేవే. అవి ఉండటం మనిషికి గర్వకారణం కాకూడదు. తమ దాతృత్వాన్ని ప్రజలు మెచ్చుకోనివ్వండి. అదీ గాక, తరగని సంపదను అల్లా తమకేగాదు, ఇతరులకు కూడా ఇచ్చాడు. బస్రానగరంలో ఒక సాధారణ పౌరుడైన యువకుడు ఉన్నాడు. అతని పేరు అబూఅల్ కాసిమ్. అతనికి ఉన్న సంపద ప్రపంచంలో ఏ చక్రవర్తికీ లేదు. దాతృత్వంలో ఏలిన వారు కూడా అతనితో పోటీ చెయ్యలేరు," అనేశాడు.

ఈ మాటలు వినేసరికి ఖలీఫా ముఖం ఎర్రబడి కళ్ళ నుండి నిప్పులు రాలాయి. ఆయన జఫర్‌తో, "బుద్ధిహీనుడా, ఇలాటి అబద్ధానికి శిక్ష మరణదండనే అని ఎరుగుదువా ?" అన్నాడు.

"తమ మీద ఒట్టు పెట్టుకుని చెబుతున్నాను, నేను చెప్పినది అక్షరాలా నిజం !" అన్నాడు జఫర్. అతను ఇంకా ఇలా అన్నాడు : "నా మాట నమ్మకపోతే, తమరు ఎవరి నన్నా పంపి వాకబు చేయించండి.

అరేబియా జానపదకథ




ఆ మనిషి ఏమి చెబితే దానికి నేను బద్ధుణ్ణి. నేను కిందటిసారి బ(స్రా వెళ్ళినప్పుడు అబూ అల్‌కాసిమ్‌కు అతిథిగా ఉండటం జరిగింది. మరోసారి చెబుతున్నాను—ఈ కాలంలో అతన్ని మించిన దాత (ప్రపంచంలో లేడు.''

ఖలీఫాకు నోట మాట రాలేదు. పట్టరాని కోపంలో ఆయన, జఫర్‌ను నిర్బంధించమని భటులకు సంజ్ఞ చేసి, అక్కడి నుంచి త్వరగా జుబేదా రాణి మందిరానికి వెళ్లిపోయాడు. ఆయన ముఖం చూసి జుబేదా రాణి తెల్లబోయింది. ఆమె ఆయనకు గులాబీ వాసన గల నీరు తాగటానికి ఇస్తూ, ''ఇది తాగి శాంతించండి!'' అన్నది.

''ఆ లుచ్ఛా, జఫర్ మూలంగా శాంతి లేకుండా పోయింది. వాడు నాకు ఎదురు చెప్పటమే గాక, నన్ను కాదని ఊర్గూ పేరూ లేని వెధవలను ఆకాశాని కెత్తుతున్నాడు!'' అంటూ ఖలీఫా జరిగిన దంతా చెప్పాడు.

జఫర్ ప్రాణానికి పెద్ద ముప్పే వచ్చిపడిందని జుబేదా గ్రహించి, ఖలీఫాను ఒక చెంప సమర్థించుతూనే, ఎవరినన్నా బస్రాకు పంపి విచారణ జరిపినదాకా జఫర్‌ను శిక్షించడం మంచిది కాదని సలహా ఇచ్చింది.

జుబేదా మాటల ప్రభావంతో ఖలీఫా మనసు చాలావరకు శాంతపడింది. అందుచేత ఆయన, ''నేను మాత్రం నిజం తెలుసుకోకుండా జఫర్‌ను ఎందుకు శిక్షిస్తాను? నా కళ్ళతో చూస్తేనేగాని నేను దేన్నీ నమ్మలేను. అందుచేత నేనే స్వయంగా వెళ్ళి, బస్రాలో ఉండే అబూ అల్‌కాసిమ్‌ను చూస్తాను. జఫర్ అతిశయోక్తులు చెప్పి ఉంటే వాడికి ఉరిశిక్ష తప్పదు,'' అన్నాడు.

ఒంటరిగా వెళ్ళవద్దని జుబేదా ఎంత బతిమాలినా వినిపించుకోకుండా, ఖలీఫా వర్తకుడి లాగా మారువేషం వేసుకుని, బస్రాకు బయలుదేరి వెళ్ళాడు.

ఆయన క్షేమంగా బస్రా చేరి, ఆ నగరంలోని పెద్ద సత్రంలో దిగాడు. భోజనానికైనా

కూర్చోకుండానే; ఆయన సత్రం చౌకీదారును కలుసుకుని, "ఈ ఊళ్ళో అబూ అల్ కాసిమ్ అనే యువకుడున్నాడట; అతను చేసే దానాలు మహారాజులు కూడా చేయలేరట, నిజమేనా?" అని అడిగాడు.

చౌకీదారు తల ఆడించి, "అల్లా అనుగ్రహం! ఆ మహానుభావుడి దయకు పాత్రుడు కానివాడు ఒక్కడైనా ఉన్నాడా? నాకు నూరు నోళ్ళున్నా కూడా అతని దానాలను వర్ణించలేను," అన్నాడు. ఇంతలో ఇతర వర్తకులు దిగటంవల్ల చౌకీదారు వారి కోసం వెళ్ళిపోవలసి వచ్చింది.

ఖలీఫా ఆ రాత్రికి అంతటితో తృప్తిపడి, మర్నాడు ఉదయమే లేచి దుకాణాలుండే బజారు కేసి వెళ్ళాడు. దుకాణాలు తెరవగానే ఒక దుకాణదారును కలుసుకుని, అబూ అల్ కాసిమ్ ఇంటికి దారి అడిగాడు.

"మీరు దూరప్రాంతం నుంచి వచ్చినట్టున్నది. రాజభవనంలో రాజుగారిని ఎరగని వాళ్ళు ఉండవచ్చునేమో గాని, ఈ నగరంలో అబూ అల్ కాసిమ్ ఇల్లు తెలియనివారు లేరు," అన్నాడు దుకాణదారు.

"నేను దూరం నుంచే వచ్చాను. వచ్చినది కూడా ఈ యువకుణ్ణి చూడటానికే," అన్నాడు ఖలీఫా దుకాణదారుతో.

దుకాణదారు ఖలీఫా వెంట ఒక కుర్రవాణ్ణి పంపాడు.




అబూ అల్ కాసిమ్ భవనం చుక్కల పాలరాతితో కట్టారు. దాని ద్వారాలకు వెల లేని ఆకుపచ్చమణి శిలలు తాపారు. భవనం ముందు ఆవరణలో కొందరు బానిసలు ఆటలలో మునిగి ఉన్నారు. ఖలీఫా ఒక బానిసను పిలిచి, ఇంటి యజమానిని చూడటానికి బాగ్దాదు నుంచి ఒక అపరిచితుడు వచ్చినట్టు చెప్పమని లోపలికి పంపాడు.

ఈ కబురు అందగానే అబూ అల్ కాసిమ్ అతిథికి స్వాగతం చెప్పటానికి బయటికి వచ్చి, మృదువుగా స్వాగత వచనాలు పలికి, ఖలీఫాను చెయ్యి పట్టుకుని ఒక అందమైన హాలులోకి తీసుకుపోయాడు.



గది నాలుగు గోడల వెంబడీ జరీ అంచు గల సిల్కు తొడుగులు గల మెత్తలున్నాయి. ఇద్దరూ వాటి మీద ఆసీనులయినాక, పన్నెండుమంది బానిసలు కెంపులు పొదిగిన స్ఫటిక పాత్రలలో ద్రాక్షసారా తెచ్చారు. వారి వెనకగా పన్నెండుమంది ఆడపిల్లలు పింగాణీ పాత్రలలో పళ్ళూ పూలూ, బంగారు పాత్రలలో షర్బతూ తెచ్చారు. వాళ్ళు తెచ్చిన పానీయాలు చవి చూడగానే, తన భవనంలో అలాటి పానీయాలు ఎన్నడూ లేవని ఖలీఫాకు తెలిసిపోయింది.

మరొక గదిలో ఖలీఫాకు బంగారు పళ్లాలలో భోజనం పెట్టారు. ఆ భోజన పదారాలు కూడా ఉత్తమోత్తమంగానే ఉన్నాయి. తరవాత ఆయన తనకోసం ఏర్పాటు చేసిన సంగీతం వింటూ, "నా రాజభవంలోనూ శ్రావ్యమైన గాయకులున్నారు; సంగీత రహస్యాలన్నీ తెలిసిన ఇషాక్ ఉన్నాడు; కాని ఈ సామాన్య వ్యక్తి ఇంట జరిగే గాన గోష్ఠి స్వర్గంలో కూడా లభించదనిపించేదిగా ఉన్నదే!" అనుకున్నాడు.

ఖలీఫా సంగీతం వినటంలో నిమగ్నుడై ఉండగా అబూ అల్ కాసిమ్ లేచి అవతలికి వెళ్ళి, ఒక చేతిలో అంబరు బెత్తమూ, రెండో చేతిలో ఒక చెట్టుబొమ్మా పట్టుకుని వచ్చాడు. ఆ బొమ్మచెట్టు కాండం వెండితోనూ, ఆకులు పచ్చలతోనూ, కాయలు కెంపులతోనూ చేసి ఉన్నాయి. చెట్టు పై భాగంలో ఒక బంగారు నెమలి బొమ్మ ఉన్నది. అది ఎంతో నైపుణ్యంతో తయారు చేసిన నెమలిబొమ్మ. అబూ అల్ కాసిమ్ ఆ చెట్టును ఖలీఫా ముందు పెట్టి, నెమలి బొమ్మను అంబరుబెత్తంతో కొట్టగానే ఆ నెమలి రెక్కలు చాపి, పింఛం విప్పి, వేగంగా గుండ్రంగా తిరగసాగింది. అది అలా తిరుగుతుంటే దాని శరీరంలోని రంధ్రాల నుంచి సువాసనలు వెలువడి, వాటితో గది అంతా నిండిపోయింది.

కాని హరూన్ చేరగిలబడి కూర్చుని ఈ వింత వస్తువును చూసి ఆనందించటం ప్రారంభించే సరికల్లా అబూ అల్ కాసిమ్

చప్పిన ఆ బొమ్మను తీసేసుకుని అవతలికి వెళ్ళిపోయాడు.

"ఇదేం మనిషి? అతిథి సత్కారమంటే ఇలా వుంటుందా ఎక్కడన్నా? జఫర్ చెప్పినంత కాకపోతే మానె, ఈ మనిషికి మామూలు మర్యాదలు కూడా తెలిసినట్టు లేదే! ఆ పక్షిబొమ్మను అడిగేస్తానని భయ పడ్డాడు లాగుంది. ఈ మనిషి గొప్పదనాన్ని స్వయంగా చూడరావటం మేలే అయింది." అనుకున్నాడు ఖలీఫా.

ఆయన ఇలా అనుకుంటూండగా అబూ అల్ కాసిమ్ ఒక అందమైన బానిస కుర్ర వాణ్ణి వెంటబెట్టుకుని తిరిగి వచ్చాడు. ఆ కుర్రవాడు ముత్యాలు కూర్చిన చమ్కీ దుస్తులు ధరించి ఉన్నాడు. వాడి చేతిలో ఒక పాత్ర ఉన్నది. అది ఒకే కెంపురాయి నుంచి మలిచిన పాత్ర. ఆ పాత్ర నిండా సారా ఉన్నది. బానిసకుర్రవాడు ఖలీఫాకు వందనం చేసి, ఆ పాత్రను ఖలీఫాకు అందించాడు. ఖలీఫా అందులోని సారా తాగేసి చూస్తే, దాని నిండా తిరిగి సారా ఉంది. దానిని మళ్ళీ తాగి ఖలీఫా బానిస కుర్రవాడి కిస్తూ, అది మూడోమారు సారాతో నిండుతూండటం గమనించాడు.

ఈ అక్షయ సారాపాత్ర నెమలిబొమ్మ కన్న కూడా అద్భుతంగా ఖలీఫాకు తోచింది "దీని మర్మం ఏమిటి?" అని ఆయన అబూ అల్ కాసిమ్‌ను అడిగాడు.

"అందులో నిజానికి అద్భుత మేమీ లేదు. ఒక ప్రాచీన కాలపు విజ్ఞాని దీన్ని





తయారుచేశాడు," అంటూ అబూ అల్‌కాసిమ్ బానిస కుర్రవాళ్లు త్వరత్వరగా అక్కడి నుంచి లాక్కుపోయాడు.

"ఛీ, ఛీ! ఈ యువకుడికి కొంచెం కూడా బుద్ధి లేదనుకోవాలి, లేదా ఇతనికి సాధారణ మర్యాదలు కూడా తెలియక పోవాలి; నేను అడగా పెట్టకుండా అద్భుత వస్తువులు తెచ్చి చూపుతాడు; నాకు వాటిలో ఆసక్తి కలుగుతూండగా లాక్కుపోతాడు! ఇది మోసమూ, వెకిలితనమూ కూడాను. కొంచెం ఆలోచించి మాట్లాడేటట్టుగా జఫర్‌కు బుద్ధి చెప్పాలి," అనుకున్నాడు ఖలీఫా.

ఇంతలోనే అబూ అల్‌కాసిమ్ తిరిగి వచ్చాడు. అతని వెంట ఒక అందమైన అమ్మాయి ఉన్నది. ఆమె అందం దేవతలకు కూడా ఉండదు. ఆమె శరీరం నిండా రత్నాలున్నాయి, కాని ఆమె అవయవాల అందాన్ని అవి దాచటం లేదు. ఆమె ఎదురుగా కూర్చుని కిన్నెర వాయిస్తూ ఉంటే ఖలీఫా ఆ పాటవశ్యంలో నెమలిబొమ్మనూ, కెంపు పాత్రనూ పూర్తిగా మరిచిపోయాడు. ఆయన యువకుడి కేసి తిరిగి, "బాబూ, నిన్ను చూస్తే ఈర్ష్య పుట్టుకొస్తున్నది!" అన్నాడు.

ఖలీఫా ఇలా అనటమే వ్యవధిగా అబూ అల్ కాసిమ్ ఆ పిల్లను చెయ్యి పట్టుకుని అక్కడి నుంచి అతి వేగంగా లాక్కుపోయాడు.

ఈ మూడో అవమానంతో ఖలీఫాకు ఎంత ఆగ్రహం వచ్చిందంటే ఇక అక్కడ ఉంటే అది అగ్నిపర్వతం లాగా బద్దలయేటట్టు తోచింది. అందుచేత ఆయన, అబూ అల్‌కాసిమ్ మరోసారి తిరిగి రాగానే, "అయ్యా, ముఖం ఎరగనివాడికి నువు చేసిన ఆతిథ్యం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఇక నాకు సెలవిస్తే నేను వెళ్ళిపోతాను. ఇప్పటికే చాలా ఆతిథ్యం పొందాను," అంటూ లేచి నిలబడ్డాడు.

అతిథిని బలాత్కారం చెయ్యటం ఇష్టం లేక, ఖలీఫా కోరిక శిరసావహించినట్టుగా తల వంచి, అబూ అల్‌కాసిమ్ ఆయనను

తలవాకిలి దాకా సాగనంపి, తన ఆతిథ్యంలో లోపా లుంటే క్షమించమని వేడుకున్నాడు.

ఖలీఫా తన బసకు తిరిగి వస్తూ, "వట్టి దాంభికుడు! మూ ఢు డు! కొత్తవాళ్ళ ముందు తన సంపదను ప్రదర్శించి తృప్తి పడతాడు. దాతృత్వం ఎన్నటికీ కాదు. పిసినారితనం. వీడు పిసినిగొట్టులలో కూడా చాలా నాసిరకం. అబద్ధా లాడినందుకు జఫర్ అనుభవిస్తాడు," అనుకున్నాడు.

మండిపోతూ ఖలీఫా సత్రం చేరేసరికి దాని ముందు ఆవరణలో అర్ధవలయా కారంలో బానిసపిల్లలు నిలబడి ఉన్నారు. వారిలో సగంమంది తెల్లబానిసలు. సగం మంది నల్లబానిసలు. వారినడుమ, అబూ అల్ కాసిమ్ ఇంట కిన్నెర వాయించిన అమ్మాయి నిలబడి ఉన్నది. ఆమెకు కుడి వైపున కెంపుపాత్ర పట్టుకుని బానిస కుర్ర వాడు నిలబడి ఉన్నాడు. ఆమెకు ఎడమ పక్కన నిలబడిన మరొక కుర్రవాడి చేతిలో నెమలిగల చెట్టున్నది.

ఖలీఫా ఆవరణలోకి అడుగు పెట్టగానే బానిసలందరూ ఆయన ముందు సాష్టాంగ పడ్డారు. బానిసపిల్ల ముందుకు వచ్చి ఖలీఫాకు ఒక లేఖ ఇచ్చింది. అందులో ఇలా ఉన్నది:

"మా ఇంటికి వచ్చి, మా ఇంటిని పవిత్రం చేసిన అతిథి పరుడికి శాంతి



సౌఖ్యాలు కలుగుగాక! తరువాత—ఈ హీన మైన కానుకలు తాము స్వీకరించ ప్రారన. ఈ బానిసలూ, చెట్టూ, నెమలీ, కెంపుపాత్రా తమను స్వల్పంగా ఆకర్షించటం గమనించి, వాటి నన్నిటినీ తమకు కానుకగా ఇవ్వ సాహసించాము. ప్రతిదీ అల్లా నుంచే వచ్చి, అల్లాకే తిరిగి పోతుంది!"

ఈ లేఖ యొక్క సారాంశం అర్థంకాగానే ఖలీఫాకు పశ్చాత్తాపం కలిగింది. "ఈ యువ కుణ్ణి ఎంతగా అపార్థం చేసుకున్నాను! నీ విశాలహృదయం ఏ మయింది, హరూన్! నా కసలు విశాల హృదయమంటూ లేనే లేదు! విశ్వాస పాత్రుడైన జఫర్! అల్లా నిన్ను కటాక్షించుగాక! నా అతిశయానికీ,

దురహంకారానికీ మంచి పాఠం నేర్పావు. ఈ మామూలు పౌరుడు, రాజాధిరాజులు సైతం ఇచ్చి వేయటానికి జంకే కానుకలను నిశ్చింతగా ఇచ్చేశాడు. మామూలు పౌరుడి కింత సంపద ఎక్కడిది? మర్యాదకు భంగ మైనా సరే నేనీ రహస్యం తెలుసుకోవాలి," అనుకున్నాడు ఖలీఫా.

అందు చేత ఆయన తన కానుకలను సత్రం ఆవరణలోనే ఉండనిచ్చి, అబూ అల్ కాసిమ్ ఇంటికి తిరిగి వెళ్ళి, "మహా దాతా, అల్లా కటాక్షం నీమీద మరింత ఉండు గాక! నువు పంపిన కానుకలు ఎంత అమూల్యమైన వంటే, వాటిని స్వీకరించ టానికి నాకు జంకుగా ఉన్నది. వాటిని తీసుకోవటం అతిథిగా నా ధర్మాన్ని నేను అతిక్రమించట మవుతుందనిపిస్తున్నది. వాటిని తిరిగి ఇవ్వటానికి అనుమతించి నట్టయితే నేను శలవు పుచ్చుకుని నీ దాతృ త్వాన్ని బాగ్దాదులో చాటుతాను," అన్నాడు.

ఈ మాటలు విని అబూ అల్ కాసిమ్ దీనంగా, "స్వామీ, నా ఆతిథ్యమూ, నే నిచ్చిన క్షుద్రమైన కానుకలూ తమకు అసంతృప్తి కలిగించి ఉండాలి. లేనిపక్షంలో తమరు సత్రం నుంచి తిరిగివచ్చి నన్నిలా అవమానించరు!" అన్నాడు.

వెంటనే ఖలీఫా, "అలా ఎన్నటికీ అనుకో వద్దు. అల్లా దయవల్ల నేను ఆతిథ్యం ఇచ్చిన వారిని అవమానించే మనిషిని కాను. ముఖం తెలియని వారికి ఇంత వెలలేని బహుమానా లిచ్చి, నువు దారిద్ర్యం పాతపడతావేమో నని తిరిగి వచ్చాను," అన్నాడు.

"మీరు తిరిగి రావటానికి అదే కారణ మైతే మీకు ఎలాటి విచారమూ వద్దు. ఎందు చేతనంటే, అభ్యాగతులుగా వచ్చేవారికి నిత్యమూ ఇలాటి కానుకలే ఇస్తూ అల్లా రుణం తీర్చుకుంటున్నాను. అసలు సంగతి ఏమంటే, అల్లా నాకు తరగని సంపద ఇచ్చాడు. నా మాట మీరు నమ్మాలంటే నా కథ అంతా మీకు చెప్పాలి. నిజానికి అది చాలా చిత్రమైన కథ," అన్నాడు అబూ అల్ కాసిమ్.

—(ముగింపు వచ్చే సంచికలో)





# వింతయాచకులు

ఒక ఊళ్ళో వెంకటాద్రి అనే ధనికుడు ఉండేవాడు. ఆయనకు సంతానం కలగకా, కలిగిన సంతానం నిలవకా, చాలా విచారంలో పడి, ఎన్నో వ్రతాలూ, ఉపవాసాలూ చేశాడు; గ్రహశాంతులు జరిపించాడు. . ఈ విధంగా నడివయసు దాటి పోగా, వెంకటాద్రి కాశీ యాత్ర చేసి వద్దామని తన భార్యతో సహా బయలుదేరాడు.

దారిలో వాళ్ళు పక్క గ్రామంలో ఆగి, వెంకటాద్రి స్నేహితుడైన కుటజాద్రి అనే అతని ఇంట బస చేశారు. ఈ కుటజాద్రి కూడా సంతానం లేక బాధ పడుతున్నవాడే. అతను కూడా కాశీయాత్ర చేద్దామనుకున్నాడు గాని, వెంటనే బయలుదేరటం అతనికి సాధ్యం కాలేదు. అందుచేత అతను తను చేర్చి పెట్టిన వందరూపాయలు వెంకటాద్రి కిచ్చి. "నువు కాశీలో నా పేర పూజలూ, సేవలూ, అర్చనలూ చేయించి, నాకు కూడా సంతానం కలిగేలాగు దేవుణ్ణి వేడు. నా పరిస్థితి ప్రయాణానికి అనుకూలంగా లేదని దేవుడికి తెలీదా? ప్రాప్తి ఉంటే ఆయన తప్పక అనుగ్రహిస్తాడు," అన్నాడు.

వెంకటాద్రి ఆ ప్రకారమే కాశీలో తాను జరిపించిన సేవలన్నీ దేవుడికి కుటజాద్రి పేర కూడా జరిపించి, సంతానం కోసం తాను వేడుకున్నట్టే కుటజాద్రి కోసం కూడా వేడుకున్నాడు.

కాశీలో ఒక యోగి ప్రసాదం ఇచ్చి, ప్రజల మంచి కోరికలను ఈడేరుస్తాడని తెలిసి, వెంకటాద్రి ఆ యోగిని దర్శించి, తన పక్షానా, కుటజాద్రి పక్షానా యోగికి పాద పూజలు చేసి, తన కోరికా, తన మిత్రుడి కోరికా చెప్పుకున్నాడు.

యోగి వెంకటాద్రికి విభూతి ఇచ్చి, "ఇందులో సగం నీ భార్యకూ, సగం

ఎస్. రామవరావు



నీ మిత్రుడి భార్యకూ ఇయ్యి. దాన్ని సేవించి ఇద్దరూ సంతాన వతులవుతారు," అన్నాడు. వెంకటాద్రి భార్య సగం ప్రసాదాన్ని అప్పుడే సేవించింది. మిగిలిన ప్రసాదాన్ని వెంకటాద్రి తిరుగు ప్రయాణంలో తెచ్చి తన స్నేహితుడి భార్యకు ఇప్పించాడు.

వెంకటాద్రి భార్య గర్భవతి అయి, సకాలంలో ఒక మగ బిడ్డను కన్నది. కుటజాద్రి భార్య కూడా గర్భవతి అయి, రెండు నెలల అనంతరం తాను కూడా ఒక మగ బిడ్డను కన్నది.

వెంకటాద్రి కొడుకుకు విశ్వనాథుడు అనీ, కుటజాద్రి కొడుకుకు కాశీనాథు డనీ పేర్లు పెట్టుకున్నారు.

కుటజాద్రి కొడుకు కాశీనాథుడు పెరుగుతూ విచిత్రమైన మనస్తత్వం ప్రదర్శించసాగాడు; కొన్నిరకాల బట్టలే కావాలనేవాడు; తల్లి చేసినది తినక, తనకు ఫలానా తిండే కావాలనేవాడు; ఇతర పిల్లలతో చేరి ఆడే టప్పుడు కూడా, వాళ్ళు ఆడే ఆట మాని, అకస్మాత్తుగా మరేదో ఆట ప్రారంభించేవాడు. అయిదో ఏట అక్షరాభ్యాసం ప్రారంభిస్తే వాడు ప్రతి పాఠమూ అతి సులువుగా నేర్చుకోసాగాడు.

ఒకసారి కుటజాద్రి వెంకటాద్రి ఇంటికి వచ్చి, వెంకటాద్రి కొడుకు విశ్వనాథుడు తన కొడుకు కావాలనే దుస్తులే వేసుకోవటమూ, అదేరకం తిళ్ళు తినటమూ, అదే మాదిరి ఆటలు ఆడటమూ గమనించి, వెంకటాద్రితో ఈ మాట చెప్పాడు. ఈ వింతకు ఇద్దరూ ఆశ్చర్యపడి, కాశీలో యోగి ఇచ్చిన ప్రసాదం మహిమ కాబోలు అనుకున్నారు.

అది నిజమే. విశ్వనాథుడికి వచ్చే ప్రతి ఆలోచనా కాశీనాథుడికి కూడా కలిగేది. విశ్వనాథుడు చేసే ప్రతి పనీ కాశీనాథుడు కూడా చేశాడు. విశ్వనాథుడు నేర్చుకున్న చదువు కాశీనాథుడికి నేర్చుకోకుండానే వచ్చేసింది. ఈ వింత అందరికీ తెలిసిపోయింది. అందరూ వాళ్ళను "వింత అబ్బాయిలు" అనసాగారు. ఇద్దరు కుర్ర

వాళ్ళకూ రూపంలోనూ, ఆకారాల్లోనూ తేడా ఉన్నప్పటికీ, వాళ్ళ చేతలలోనూ, ఆలోచనలలోనూ తేడా ఏమీ లేదు. ఒకరేది చేస్తే రెండోవాడూ అదే చేసేవాడు. ఒకడు భోజనానికి కూర్చుంటే రెండోవాడూ కూర్చునేవాడు. వేరు వేరు గ్రామాలలో ఉండి కూడా వాళ్ళు ఒకరినొకరు అను కరిస్తూ వచ్చారు.

కాని ఇద్దరి మధ్యా స్నేహమంటూ ఏమీ లేదు. ఎప్పుడైనా ఒకరి కొకరు ఎదురైతే ఇద్దరూ చిరునవ్వు నవ్వేవారు. "నువెం దుకు నవ్వావు?" అని ఒకడు అడిగితే, "నువ్వు నవ్వినందుకే," అని రెండోవాడు సమాధానం చెప్పేవాడు. తరవాత ఎవరి దారిన వారు వెళ్ళిపోయేవారు.

ఇద్దరూ క్రమంగా పెరిగి పెద్దవారయారు. కొంతకాలానికి ఇద్దరి తండ్రులూ పోయారు.

విశ్వనాథుడికి పెళ్ళి యీడు వచ్చి నప్పటి నుంచీ అతనికి సంబంధాలు రాసాగాయి. అతను చాలామంది కన్యలను చూసి, వరకు విశాలాక్షి అనే పిల్లను ఎన్నుకున్నాడు.

విశాలాక్షి తండ్రి భీమయ్య ఈ సంబం ధానికి ఒప్పుకుని పెళ్ళి తాంబూలాలు ఇవ్వ టానికి ముహూర్తం నిర్ణయించాడు.

ఇది జరిగిన మర్నాడే కాశీనాథుడు తిన్నగా భీమయ్య ఇంటికి వచ్చి, తానెవ రైందీ చెప్పుకుని, "మీ అమ్మాయి విశా లాక్షిని నా కిచ్చి పెళ్ళి చెయ్యండి," అని అడిగాడు.





"నిన్ననే విశ్వనాధుడికి సంబంధం నిశ్చయించాను. విశాలాక్షిని నీకు ఎలా ఇయ్యగలను?" అన్నాడు భీమయ్య.

"ఇంకా నిశ్చితార్థం కాలేదు గద?" అన్నాడు కాశీనాధుడు.

అతనితో ఆలోచించి చెబుతానని చెప్పి పంపేసి, భీమయ్య విశ్వనాధుడి ఇంటికి వెళ్ళాడు. కాశీనాధుడూ, విశ్వనాధుడూ పోటీ పడితే, ఓలె ఎక్కువ ఇచ్చినవాడికి తన కుమార్తెను ఇచ్చి చెయ్యాలని ఆయన ఉద్దేశం.

ఆయన విశ్వనాధుడితో, "కాశీనాధుడు మా పిల్లకు ఎంత కట్నమైనా ఇస్తానంటున్నాడు. అతనికే పిల్లనిస్తే బాగుంటుందనుకుంటున్నాను. ఎందుకంటే ఆ కుర్రవాడు చాలా పట్టుదలగా ఉన్నాడు. ఇవ్వనంటే ఏమి ముప్పు తెచ్చిపెడతాడో నని భయంగా ఉంది," అన్నాడు.

"అయితే నేనేనా చూస్తూ ఊరుకునే వాణ్ణి? నాతో ఈ మాట చెప్పటానికి మొహం ఎలా చెల్లింది? మీరు మీ పిల్లను కాశీనాధుడికి ఎలా ఇస్తారో చూస్తాను?" అంటూ విశ్వనాధుడు ఉగ్రుడయాడు.

విశ్వనాధుడు కాశీనాధుణ్ణి చంపిపారెయ్యటానికే నిశ్చయించాడు. అతను ఆ రాత్రి ఇనపకర్రను తీసుకుని కాశీనాధుడి ఇంటికి వెళ్ళి, గోడ దగ్గర పొంచి కూర్చున్నాడు. తెల్లవార్లూ చూసినా కాశీనాధుడి ఇంటిలో నుంచి ఎవరూ బయటికి రాలేదు.

కారణమేమంటే, విశ్వనాధుడికి కలిగిన ఆలోచనే కాశీనాధుడికీ కలిగింది. అతను కూడా ఒక ఇనపకర్ర తీసుకుని వెళ్ళి, తెల్లవార్లూ విశ్వనాధుడి ఇంటి గోడ పక్కన పొంచి కూర్చున్నాడు.

తెల్లవారి ఎవరి ఇళ్ళకు వారు తిరిగి వస్తూ నడిదారిలో ఇద్దరూ కలుసుకుని వాగ్వాదంలోకి దిగారు; నువ్వెక్కడికి పోయావంటే నువ్వెక్కడికి పోయావని రెట్టించుకున్నారు; "నేను పెళ్ళాడదలిచిన పిల్లను నువ్వెలా పెళ్ళాడతా"వని ఒకరి నొకరు కొక్కరించుకున్నారు.

ఆ సమయంలో అక్కడ పోగయిన జనంలో వీళ్ళిద్దరినీ ఎరిగిన పెద్దమనిషి ఒకడు, "మీరిద్దరూ ఎందుకు కీచులాడుకుంటారు? పిల్లనివ్వవలసినవాడు భీమయ్య. ఆయన ఇంటికి పోదాం రండి. ఏదో ఒకటి తేల్చుకోవచ్చు," అన్నాడు.

ఆయన వాళ్ళిద్దరినీ భీమయ్య ఇంటికి తీసుకుపోయి, ఇంటి నడవాలో కూర్చోబెట్టి, లోపల భీమయ్యతో ఏదో మాట్లాడి బయటికి వచ్చాడు.

తరవాత భీమయ్య యువకుల వద్దకు వచ్చి, "ఈ సమస్య మా అమ్మాయికే వదులుతున్నాను. రేపు మీ రిద్దరూ రండి. పదిమందినీ పిలుస్తాను. విశాలాక్షి ఎవరిని వరిస్తే వారికే పెళ్ళి తాంబూలం ఇస్తాను," అన్నాడు.

మర్నాడు విశ్వనాథుడూ, కాశీనాథుడూ భీమయ్య ఇంటికి వెళ్ళేసరికి అక్కడ చాలా మంది ఉన్నారు.

"మీ రిద్దరూ ఒకేచోట ఉంటే, ఒకరిని విడిచి రెండోవాడి మెడలో మాల వెయ్యటానికి మా పిల్ల బిడియపడుతుంది," అని చెప్పి భీమయ్య విశ్వనాథుణ్ణీ, కాశీనాథుణ్ణీ వేరు వేరు గదులలో కూర్చోబెట్టాడు.

తరవాత కొంతసేపటికి విశ్వనాథుడు నవ్వుతూ గది నుంచి బయటికి వచ్చాడు. అతని మెడలో మాల ఉన్నది. అతని వెనకగా విశాలాక్షి వచ్చింది. అదే సమయంలో రెండో గదిలో నుంచి కాశీనాథుడు కూడా మెడలో మాల ధరించి వచ్చాడు. అతని వెనక కూడా విశాలాక్షి నడిచి వచ్చింది. ఇద్దరమ్మాయిలూ ఒకే విధంగా ఉన్నారు.

అక్కడ చేరిన పెద్దలు ఈ దృశ్యం చూసి నిర్ఘాంతపోయారు.

"ఆశ్చర్యపడకండి. ఇద్దరూ విశాలాక్షులే. ఒకతె పెద్ద విశాలాక్షి, ఇంకొకతె చిన్న విశాలాక్షి. కవలపిల్లలు," అన్నాడు భీమయ్య పెద్దగా నవ్వుతూ.

విశ్వనాథ కాశీనాథుల సమస్య తేలికగా పరిష్కారమయింది. వాళ్ళిద్దరూ తాము కోరిన భార్యలను పెళ్ళాడి సుఖంగా ఉన్నారు.



# కుయుక్తి

ఒక రైతుకు కూలివాడు కావలిసి వచ్చాడు. మూడు పూటలు తిన్నంత తిండి పెడితే, వేరే కూలిడబ్బులు అడగకుండా పని చేస్తానని సోమన్న అనే పనివాడు వచ్చాడు.

రైతు అందుకు సంతోషంగా ఒప్పకుని, మర్నాడు ఉదయం నుంచీ పనిలోకి రమ్మన్నాడు.

మర్నాడు పొద్దున సోమన్న వచ్చి కంచం దగ్గిర కూర్చున్నాడు. రైతుభార్య వాడికి అన్నం పెట్టింది. సోమన్న ఏకంగా ఇద్దరుమనుషుల అన్నం తినేశాడు. రైతుభార్య నిర్ఘాంత పోయి, సోమన్న తిండి పుష్టిని గురించి భర్తకు చెప్పింది. మధ్యాన్నం తిండి కూడా ఈ పూటే తినమని చెప్పమని రైతు తన భార్యకు సలహా ఇచ్చాడు. రైతుభార్య చెప్పినట్టు మధ్యాన్నం భోజనం కూడా అప్పడే తినటానికి ఒప్పకుని సోమన్న మళ్ళీ ఒక మనిషి అన్నం తినేశాడు.

రైతు కంగారుపడి పోయి, "చూడు సోమన్నా. మేం ఈ సాయంకాలం ఊరికి పోతున్నాం. రేపు ఉదయంగాని రాలేం. అందుచేత రాత్రి తిండి కూడా ఇప్పుడే తినెయ్యి," అన్నాడు.

సోమన్న అందుకు కూడా ఒప్పకుని మరొకమనిషి అన్నం తిన్నాడు.

"ఇక నువు వెళ్ళి పొలంపని చూసుకో," అన్నాడు రైతు.

"రాత్రి భోజనం చేశాక పని ఎవరు చేస్తారండీ?" అంటూ సోమన్న అక్కడే కాళ్ళు చాచుకుని, పడుకుని నిద్రపోయాడు.

—తిగెల అప్పలనరసయ్య గుప్త.





# విష్ణుమాయ

పూర్వం నారదముని హిమాలయ పర్వతాల మీద, మానసరోవరం సమీపంగా ఒక కుటీరం కట్టుకుని తపస్సు ప్రారంభించాడు. నారదుడు చేసే ఘోర తపస్సు తన పదవికి ముప్పు తెస్తుందని ఇంద్రుడు భయపడి, తపోభంగం చేసి రమ్మని రంభ మొదలుగా గల అప్సరసలను పంపాడు. వారు ఎంత ప్రయత్నించీ నారదుడి తపస్సును భంగ పరచలేక పోయారు.

కొంతకాలం తపస్సు చేసిన మీదట నారదుడికి తన తపస్సు సిద్ధించిందని తోచింది. ఆయన బ్రహ్మ వద్దకు వెళ్ళి తన తపస్సు సిద్ధించిందని చెప్పి, అక్కడి నుంచి కైలాసానికి వెళ్ళి, పార్వతీ పరమేశ్వరులను చూసి, "నాకు తపస్సిద్ధి కలిగింది. ఇక శివమాయ నన్నేమీ చెయ్యలేదు," అన్నాడు.

ఆ మాటకు శివుడు, "అలా అనకు, శివమాయను నేనే తెలుసుకోలేదు. నువు కొంచెం జాగ్రత్తగా వుండటం మంచిది," అని నారదుణ్ణి హెచ్చరించాడు.

నారదుడు శివుడి హెచ్చరికను లక్ష్యం చెయ్యక వైకుంఠానికి వెళ్ళి, "లక్ష్మిజనార్దనులారా, మీ దయవల్ల నేను ఇంద్రియాలను జయించి తపస్సు చేసి సిద్ధి పొందాను. ఇక నన్ను శివమాయ గాని, విష్ణుమాయ గాని అంటవు!" అన్నాడు.

ఆ మాటకు జనార్దనుడు, "నారదా, మాయ అన్నది ప్రకృతి నుంచి పుట్టి, శివకేశవులను ఆశ్రయించి తిరుగుతూ ఉన్నది. దాన్ని జయించటం ఎవరి తరమూ కాదు. తగిన జాగ్రత్తలో వుండు," అని నారదుణ్ణి తాను కూడా హెచ్చరించాడు.

నారదుడు జనార్దనుడి వద్ద సెలవు పుచ్చుకుని లోకసంచారం చేస్తూ కల్యాణదుర్గ మనే పట్టణం చేరాడు. ఆయన వీధి వెంట నడుస్తుండగా మర్నాడు రాజుగారి



రాజకుమార్తెను చూడగానే నారదుణ్ణి మాయ ఆవహించింది. ఆయన రమాలక్ష్మి మీద మోహం కలిగినవాడై, "రాజా, నీ కుమార్తెను నా కిచ్చి పెళ్ళి చెయ్యి. అందు వల్ల నీ వంశం తరిస్తుంది. నేను కూడా సంతోషిస్తాను," అన్నాడు.

"మునీశ్వరా, మీ రన్న మాట అబద్ధం కాదు. కాని స్వయంవరంలో ప్రధానమైనది కన్య యొక్క ఇష్టమే గద. ఆమె కోరుకున్న వాడి కిచ్చి వివాహం చేయటం నా ధర్మం. రేపు మీరు కూడా దయచేసి, మిమ్మల్నే కోరు కుంటుందేమో చూడండి," అన్నాడు రాజు.

"తప్పకుండా వస్తాను," అని నారదుడు రాజుతో చెప్పి, తిన్నగా వైకుంఠానికి వెళ్ళి, "జనార్దనా, నేను ఇల్లూ, వాకిలీ లేక, సంసారం లేక, గాలికి తిరుగుతున్నాను. నువు అనుగ్రహించావంటే, నేను కూడా పెళ్ళిచేసుకుని, స్థిరంగా, సుఖంగా జీవి స్తాను. నా కోరిక తీర్చు," అని అడిగాడు.

"నీ కోరిక ఏమిటో చెప్పకపోతే నే నెలా తీర్చేది?" అన్నాడు జనార్దనుడు.

"రేపు కల్యాణపురంలో రాజకుమార్తె స్వయంవరం జరగబోతున్నది. ఆమె విష్ణువునే పెళ్ళాడగోరుతున్నదిట. నువు నీ రూపాన్ని నాకు అనుగ్రహించు. నేను ఆ రూపంతో స్వయంవరానికి వెళతాను. ఆమె నన్నే వరిస్తుంది," అన్నాడు నారదుడు.

కుమార్తె అయిన రమాలక్ష్మికి స్వయంవరం జరుగుతుందనీ, అందరూ వచ్చి చూడ వచ్చుననీ చాటింపు వేస్తున్నారు.

ఈ చాటింపు వింటూనే నారదుడు రాజ భవనానికి వెళ్ళి, రాజును, "రాజా, మీ పట్టణ మంతా అలంకరించి, అట్టహాసంగా ఉన్నది. ఏమిటి విశేషం?" అని అడిగాడు.

రాజు వెంటనే పరిచారికలను పంపి తన కుమార్తెను పిలిపించి, నారదుడికి ఆమె చేత నమస్కారం చేయించి, "మునీశ్వరా, ఈ పిల్ల నా కుమార్తె రమాలక్ష్మి. ఈమెకు రేపు స్వయంవరం జరుపుతున్నాను. ఈమె స్వయంవరంలో మహావిష్ణువును తప్ప మరె వ్వరినీ వరించ నంటున్నది," అన్నాడు.

''నారదా, నువు శివమాయలో పడ్డావు. ఈ కోరికను వదులుకుంటే గాని నువు సుఖ పడవు,'' అన్నాడు జనార్దనుడు.

నారదుడికి కోపం వచ్చింది.

''శివమాయ గాని, విష్ణుమాయ గాని నన్నేమీ చేయలేవు. నేను నిన్ను ఎన్నడూ ఏదీ కోరి ఉండలేదు. కోరక కోరక కోరితే నువు స్వార్థం కొద్దీ నాకు నీతులు చెబుతు న్నావు,'' అన్నాడు నారదుడు.

''అదేమీ లేదు, నారదా! నీ కోరిక తీర్చుతాను. నీకు నా రూపం ఇస్తాను. స్వయంవరానికి వెళ్ళు,'' అని జనార్దనుడు నారదుడితో అన్నాడు,



నారదుడు పరమానందం చెంది, తన శరీరాన్ని చూసుకున్నాడు. అది అచ్చు విష్ణు శరీరం లాగే అయింది. దాన్ని చూసుకుని మురిసిపోతూ నారదుడు స్వయంవర మంట పాన్ని చేరుకున్నాడు. అక్కడ రాజులూ, రాజకుమారులూ కూర్చుని ఉన్నారు. నార దుడు వెళ్ళి రాజకుమారుల మధ్య ఒక ఆసనంలో తాను కూడా కూర్చున్నాడు. ఎప్ప టికి ముహూర్తం వస్తుందా, వరణం ఎప్పుడు జరుగుతుందా అని నారదుడు తహతహలాడి పోతున్నాడు.

ఇంతలో ముహూర్తం దగ్గిర పడిందనీ, రాజకుమార్తె రమాలక్ష్మి వస్తున్నదనీ పరిచా రికలు వచ్చి సభలో ప్రకటించారు. ఆ వెంటనే రమాలక్ష్మి ఒక పల్లకిలోవచ్చి, సభలో నిలబడింది. ఆమె పెళ్లికూతురికి తగిన వస్త్రాభరణాలంకారాలు ధరించి ఉన్నది. ఆమె తండ్రి వచ్చి ఆమె పక్కన నిలబడి, స్వయంవరానికి వచ్చినవారితో, ''మహాజనులారా! ఈ కన్యక నా కూతురు. ఈమె పేరు రమాలక్ష్మి. ఇక్కడ చేరిన వారిలో ఎవరి కంఠంలో వరమాల వేస్తుందో వారికి ఈమెనిచ్చి పెళ్ళి చేస్తాను,'' అన్నాడు.

పురోహితుడు మంత్రాలు చదువుతూ రమాలక్ష్మి చేతికి ఒక పూమాల ఇచ్చి, ''నీకు నచ్చిన వరుడి మెడలో ఈ మాలను వెయ్యి,'' అని చెప్పాడు. చెలికత్తెలు రాజ కుమార్తెను చెయ్యి పట్టుకుని నడిపిస్తూ

తీసుకువచ్చి, ఒక్కొక్క రాజునూ చూపించి, వారివారి పేర్లూ, వంశాలూ, కీర్తులూ వర్ణించి చెప్పసాగారు. రాజకుమార్తె సభ మధ్యకు వచ్చేసరికి ఆమెకు జనార్దనుడు కనిపించాడు. ఆమె తన చేతిలో ఉన్న వరమాల ఆ జనార్దనుడి మెడలో వేసింది. మరుక్షణమే జనార్దనుడు రమాలక్ష్మిని తన గరుడవాహనం మీద వైకుంఠానికి తీసుకుపోయాడు. అంతా మెరుపు లాగా రెప్పపాటులో జరిగిపోయింది. ఈ హఠాత్సంఘటనకు సభికులు దిగ్భ్రమ చెందారు. రాజకుమార్తె కనపడదేమా అని నారదుడు మెడ రిక్కించి అన్ని పక్కలా చూస్తూంటే అతన్ని చూసి అందరూ గొల్లున నవ్వారు. అదంతా చూసి నారదుడు ఆశ్చర్యంతో సభికులను, "రాజకుమార్తె ఏది? ఆమె ఎవరిని వరించింది? మీ రంతా నన్ను చూసి ఎందుకు నవ్వుతున్నారు?" అని అడిగాడు.

ఆ మాటకు సభికులు, "ఎవరు నువు? నీ అవతారం చూస్తే విష్ణువు లాగున్నది, కాని నీ ముఖం కోతిముఖం లాగూ, భల్లూక ముఖం లాగూ ఉన్నది. స్వయంవరం అయిపోయింది. రాజకుమార్తె జనార్దనుణ్ణి వరించి, అతనితో వైకుంఠానికి వెళ్ళి కూడా పోయింది," అన్నారు.

నారదుడు ఆగ్రహించి వైకుంఠానికి వెళ్లి, "నువు నన్ను మోసం చేశావు గనక, నేను భార్య కోసం తపించినట్టే నువూ తపించు. నా ముఖాన్ని కోతి లాగా, భల్లూకం లాగా చేశావు గనక, నువు ఆ కోతులనూ, భల్లూకాలనూ ఆశ్రయించు," అని శపించాడు.

"నారదా, నేను నిన్ను మోసం చెయ్యలేదు. నువు శివమాయలో చిక్కుకుని మోసపోయావు. నీ శాపం వృధా కాకుండా నేను అనుభవిస్తాను. నన్ను శపించినందుకు నువు పశ్చాత్తాపపడ నవసరంలేదు," అని జనార్దనుడు చెప్పాడు.

నారదుడు జనార్దనుడి కాళ్ళ మీద పడి క్షమాపణ చెప్పుకుని, జనార్దనుడి ఆశీర్వాదం పొంది, దైవదూషణ చేసినందుకు ప్రాయశ్చిత్తంగా తీర్థయాత్రలు చేయటానికి వెళ్ళిపోయాడు.





# పంచకల్యాణి

## 2

శ్యామలనగరం రాజు అడిగిన దానికి వీర దాసు ఇలా చెప్పసాగాడు:

ఇది నా బాల్యంలో జరిగింది. మా తండ్రికి విస్తారంగా భూములుండేవి, పెద్ద ఆవుల మంద ఉండేది.

ఒకనాడు దూరాన పొలాలలో ఒక ఆవు ఈనింది. మా నాన్న నన్ను ఆ ఆవునూ, దూడనూ ఇంటికి తీసుకురమ్మన్నాడు. నేను సూర్యోదయానే అక్కడికి వెళ్ళి, దూడను ఎత్తుకుని బయలుదేరాను. ఆవు నా వెనకాలే రాసాగింది.

నేను కొద్ది దూరం నడిచేసరికి పెద్ద పెట్టున వర్షం ప్రారంభమయింది. వర్షం నిలిచేదాకా ఎక్కడైనా నిలవవలిసి వచ్చింది. కొంత దూరంలో ఏదో గుడిసె కనిపిస్తే అందులో నేను దూడతోనూ, ఆవుతోనూ సహా తల దాచుకున్నాను.

కొద్ది సేపటికల్లా ఆ గుడిసెలోకి పన్నెండు పెద్ద పిల్లులు వచ్చాయి. వాటిలో ఒకటి మిగిలిన వాటికి పెద్దలాగా కనబడింది. ఆ పెద్ద పిల్లి మిగతా పిల్లుల కేసి తిరిగి అరవ నారంభించింది. పిల్లులన్నీ ఒక్క సారి కోలాహలంగా కూతలు పెట్టాయి. వాటి అరుపులు చాలా భయంకరంగా ఉన్నాయి. అలా అరిచి, అరిచి అవన్నీ ఆవుదూడ మీద పడి, కొద్ది సేపట్లోనే దాన్ని చీల్చి తినేశాయి.

నాకు వాటిని చూస్తే భయమూ కోపమూ కూడా వచ్చింది. వాటిని తరిమి కొట్ట బోయాను కాని నాకు సాధ్యం కాలేదు. అవి నా అదరింపులను ఏ మాత్రమూ లక్ష్య పెట్టలేదు.

తరవాత అవి మళ్ళీ అన్నీ కలిసి పెద్ద పెట్టున భయంకరంగా అరిచాయి. వాటి

టి. వెంకటరావు

ఆకలి ఇంకా తీరినట్టు లేదు. ఈ సారి అవి ఆవు మీద పడి, ఎముకలు తప్ప ఏమీ మిగలకుండా తినేశాయి. నాకు భయం జాస్తి అయింది.

అవి మూడోసారి అరుపులు ఆరంభించే సరికి, ఈసారి వంతు నాదేనని తెలుసుకుని, కాలి సత్తువకొద్దీ అడవిలోకి పరిగెత్తాను. ఆ రాక్షసి పిల్లులు నన్ను తరుముకుంటూ వచ్చాయి.

అయినా నేను వాటికి అందకుండా పరిగెత్తిపోయి, గుబురుగానూ, ఎత్తుగానూ ఉన్న చెట్టెక్కి, వాటికి కనబడకుండా చిటారుకొమ్మ గుబురులో దాక్కున్నాను.

పిల్లులు నా జాడ తెలియక చెట్ల మధ్య చాలాసేపు కారాడాయి. ఆగి ప్రాణం విసిగి వెళ్ళిపోతాయేమోనని ఆశ పడ్డాను. కాని పిల్లుల పెద్ద నేనున్న చెట్టు కిందికే వచ్చి, తల ఎత్తి నన్ను పసిగట్టి, పైకి చూస్తూ అక్కడే తిష్ఠ వేసింది. త్వరలోనే మిగతా పిల్లులు కూడా అక్కడికి చేరాయి. అవి నన్ను వదిలిపెట్ట దలచలేదు.

వాటిలో ఒకటి చెట్టెక్కి రావటం ప్రారంభించింది. అది నాకు అందుబాటులోకి వచ్చే దాకా ఆగి, నా దగ్గిర ఉన్న చాకుతో దాన్ని పొడిచి చంపాను. అది కాస్తా కింద ఉన్న తోటి పిల్లుల మీద పడింది.

దానితో పిల్లుల పెద్దకు ఆగ్రహం వచ్చింది. అది పాములాగా బుసకొట్టి మిగిలిన పిల్లులతో ఏదో అన్నది. వెంటనే పిల్లులన్నీ కలిసి, నే నెక్కిన చెట్టు వేళ్ళలో ఒక



పెద్ద వేరును తెంపటానికి దాని చుట్టూ తమ గోళ్ళతో తవ్వ నారంభించాయి. త్వరలోనే ఆ వేరు తెగి చెట్టు కొంచెం ఒరిగింది. చెట్టు పడిపోతున్నదని భయపడి, నేను చావుకేక ఒకటి పెట్టాను.

చెట్టు ఒరిగిందేగాని పడలేదు. పిల్లులు మరొక పెద్ద వేరును తెంపటానికి ఉపక్ర మించాయి.

అది కూడా తెగిపోయేసరికి చెట్టు మరి కొంచెం ఒరిగింది. నేను ప్రాణభయంతో మళ్ళీ చావు కేకలు పెట్టాను.

పిల్లులు ఇక మరొక వేరును తెంపే ప్రయత్నం ప్రారంభించాయి. ఈ పని పూర్తి అయేసరికి, చెట్టు ఒరిగి నేలమీద పడి పోయింది.

నేను మాత్రం ప్రాణభయంతో చెట్టు కొమ్మను గట్టిగా కరుచుకుని, పిల్లులకు ఆహారం కావటానికి సిద్ధపడ్డాను.

అయితే నేను పెట్టిన కేకలు వృథా పోలేదు. దూరాన చుట్టు పక్కల పొలాలలో పనులు చేసుకుంటున్నవాళ్లు నా కేకలు విని, పలుగులూ, పారలూ, కర్రలూ తీసుకుని నాలుగు వైపులనుంచీ పరిగెత్తుకుంటూ వచ్చారు.

వాళ్ళను చూసి పిల్లులు పారిపోబో యాయి. కాని రైతులు వాటిని చుట్టు ముట్టి ఒక్క దాన్ని కూడా మిగల్చకుండా అన్నిటినీ చంపేశారు.

వీరదాసు ఈ సంఘటన చెప్పి, "మహా రాజా, మీరు మమ్మల్ని నేరస్థులుగా విచా రించి ఉరి తీసిన దానికన్న ఆ రాక్షస పిల్లులు పీక్కు తినటం మరింత ఘోరం కాదా?" అన్నాడు.

"నిజమే, నీ కథ బాగానే ఉన్నది. ఇలాటిదే నీ జీవితంలో జరిగిన మరొక దారుణ సంఘటన చెబితే నీ కొడుకును మరొకణ్ణి క్షమిస్తాను," అన్నాడు రాజు.

వీరదాసు కొంచెం ఆలోచించి, "అలాటి సంఘటన మరొకటి ఉన్నది, మహారాజా!" అన్నాడు.

"ఉంటే చెప్పు," అన్నాడు శ్యామల రాజు. —[పై సంచికలో మరొక కథ]





# అనుకోని పెళ్ళి



భార్గవు డనే ఒక జ్యోతిష్కుడికి లేకలేక ఒక కుమారుడు కలిగాడు. భార్గవుడు తన కొడుకు జాతకం చూసి, అతనికి ఇరవైఆరు ఏళ్ళ ఆయుస్సు మాత్రమే ఉన్నదను కున్నాడు. ఇది చూసి భార్గవుడు చాలా విచారం పొందాడు. ఆయన తన కొడుక్కు చిరాయు వని పేరు పెట్టుకుని, ఆ పిల్లవాడి జాతకాన్ని అతి శ్రద్ధగా పరిశీలించసాగాడు. ప్రాణాపాయం ఉన్న కాలంలోనే పిల్లవాడికి పెళ్ళి జరిగే యోగం కూడా ఉన్నట్టు భార్గవుడికి తోచింది. ఒక వేళ పెళ్ళి జరిగితే, పిల్లయొక్క గ్రహబలాన్ని బట్టి చిరాయువుకు ఆయువు వృద్ధి కావచ్చు ననుకున్నాడు అతను.

చిరాయువు పెరిగి పెద్దవాడయాడు. అతను మంచి అందగాడూ, ప్రజ్ఞావంతుడుగా తయారయాడు. భార్గవుడు అతనికి పెళ్ళి ప్రయత్నాలు చేయ నారంభించాడు. కాని కపటం లేనివాడు కావటం చేత ఆయన అందరితోనూ, "నా కొడుక్కు ఆయుర్దాయం ఇరవైఆరుఏళ్ళే ఉన్నది. కాని పెళ్ళి అయే యోగం కూడా ఉండటం చేత భార్య తాలూకు గ్రహబలం వల్ల ఉపకారం కలగవచ్చు," అని చెబుతూ వచ్చాడు. ఆ మాట విని చిరాయువుకు ఎవరూ పిల్ల నిచ్చారుకారు.

తన జాతకం సంగతి చిరాయువుకు కూడా తెలిసింది. అతను తండ్రితో, "నాకు ఆయుస్సు స్వల్పమయితే పెళ్ళి కూడా దేనికి? నాకు మిగిలిన కొద్ది సంవత్సరాలు కాశీవిశ్వేశ్వరుడి సన్నిధిలో గడిపేస్తాను," అని చెప్పి, కాశీకి ప్రయాణమైనాడు. వెళ్ళేటప్పుడు అతను తన తండ్రితో, "ఇరవైఆరో ఏట నేను చావనట్టయితే ఇరవైఆరో ఏట ఇంటికి తిరిగి వస్తాను," అని చెప్పాడు.

బళ్ళారి రుద్రమూర్తి

చిరాయువు కాశీకి వెళుతుండగా దారిలో ఒకనాటి సాయంకాలం అరణ్య ప్రాంతంలో ఒక ప్రయాణీకుల శిబిరం తగిలింది. ఎవరో రాజుగారు సమీపంలో ఉన్న దేశపు రాజుకూతుర్ని తన కొడుక్కు చేసుకోవటానికి తరలి వెళ్ళుతున్నాడు.

చిరాయువు రాజసేవకులను, "ఈ రాత్రికి నన్ను మీ వెంట ఉండనిస్తారా?" అని అడిగాడు. వాళ్ళు అతన్ని తమ రాజు దగ్గిరికి తీసుకుపోయి, అతని కోరిక ఆయనకు తెలిపారు.

ఆ రాజు చిరాయువును ఎగాదిగా చూసి ఒక నిర్ణయానికి వచ్చాడు. పెళ్ళి కానున్న రాజకుమారుడికి మూర్ఛల రోగం ఉన్నది. ఈ చిరాయువు ఇంచుమించు పెళ్ళికొడుకు ప్రమాణంలోనే ఉన్నాడు. పెళ్ళిపీటల మీద తన కొడుక్కు మూర్ఛ వస్తే ఏం చెయ్యటమా అనే విచారం రాజును బాధిస్తున్నది. చిరాయువును పెళ్ళికొడుకును చేసి, మూడు ముళ్ళూ పడగానే అతని దారిన అతన్ని పంపేస్తే తనకు ఏ చిక్కూ ఉండదని ఇప్పుడా రాజుకు ఒక ఊహ తట్టింది. అందుచేత ఆయన చిరాయువుతో, "మారు మాటాడకుండా నేను చెప్పినదంతా చేసి, నేను వెళ్ళమన్న దాకా నా వెంట ఉంటే నీ కీ రాత్రికి మా శిబిరంలో అన్ని సదుపాయాలూ చెయ్యటమే గాక వెయ్యి వరహాలు




బహుమానం కూడా యిచ్చి సత్కరిస్తాను," అన్నాడు.

బహుమానంమీద ఆశ లేకపోయినా, తన అక్కర తీరుతుంది గదా అని చిరాయువు రాజు చెప్పినదానికి ఒప్పుకున్నాడు. ఆ రాత్రి అతనికి అన్నీ చక్కగా అమరాయి. మర్నాడల్లా ప్రయాణం చేసి రాజుగారు చీకటి పడే వేళకు పెళ్లికూతురుండే నగరం చేరారు. వారికి బ్రహ్మాండంగా విడిది ఏర్పాట్లు జరిగాయి.

ముహూర్తం రాత్రి మూడుఝాములకు ఏర్పాటయింది. రాజసేవకులు అర్ధరాత్రి వేళ చిరాయువును లేపి, తలంటిపోసి, దివ్యమైన బట్టలు కట్టబెట్టి, ఆభరణాలు



తగిలించి, పెళ్లికొడుకును చేశారు. ముహూర్తం వేళకు అతన్ని పెళ్ళిపీటల మీదకు తీసుకుపోయారు. పురోహితుడు మంత్రాలు చదువుతూ హోమం చేస్తూం డగా చిరాయువు తన పక్కనే కూర్చుని ఉన్న రాజకుమార్తెతో రహస్యంగా, "అగ్ని సాక్షిగా, పెద్దల సమక్షంలో జరిగే పెళ్ళి నాటకం అవుతుందా?" అన్నాడు.

పెళ్ళికూతురైన రాజకుమార్తె ఆ మాటలు స్పష్టంగానే విన్నది గాని, తన భర్త అయిన వాడు అలా ఎందుకు అనవలసి వచ్చిందో అర్థం కాక, ఆశ్చర్యపడింది.

ముహూర్తం అయిపోయేసరికి తెల్లవార బోతున్నది. పెళ్ళికొడుకు తండ్రి అయిన రాజు సపరివారంగా తమ విడిదికి తిరిగి వచ్చి, చిరాయువుకు పెట్టిన బట్టలూ, నగలూ తీసేయించి, అతని బట్టలు అతని కిచ్చి, వెయ్యివరహాల సంచీ అతనికి బహూకరిస్తూ, "వెంటనే నువు నీ దారిన బయలుదేరు. తిరిగి ఈ ప్రాంతాల కనిపిస్తే నా భటులు నిన్ను ప్రాణాలతో వదలరు," అని హెచ్చ రించాడు.

చిరాయువుకు కూడా వెళ్ళిపోవాలనే ఉన్నది. అతను అప్పుడే బయలుదేరి వెళ్లి పోయాడు.

మర్నాడు పెళ్ళికూతురు విందులో తన సరసన కూర్చున్న భర్తను చూసి అతనిలో ఏదో మార్పు కలిగినట్టు శంకించింది. క్షణ క్షణానికీ ఈ అనుమానం పెరగసాగింది. అయినా తన అనుమానం రహితం చేసు కుందామని ఆమె అతనితో, "పెళ్ళిపీటల మీద మీరు నాతో ఏమిటో అన్నారు. ఆ రొదలో సరిగా వినిపించలేదు. ఏమిటది? ఇప్పుడు మళ్ళీ చెప్పండి," అన్నది.

మూర్ఖులవాడు బిత్తరపోయి, "నేనా? నేను నీతో ఏమీ అనలేదే!" అన్నాడు. అతని గొంతు కూడా చిరాయువు గొంతు లాగా లేదు. రాజకుమార్తె చివాలున లేచి నిలబడి, గట్టిగా అందరూ వినేటట్టు, "మోసం జరిగింది! నేను రాత్రి పెళ్ళాడి నది ఇతన్ని కాదు!" అన్నది.

విందు వినోదం కాస్తా పెద్ద కలవరం కింద మారింది. రాజకుమార్తెను ఆమె తండ్రి చాటుగా తీసుకుపోయి మందలించాడు. కాని ఆమె తన తండ్రికి చిరాయువు అన్న మాటలు చెప్పి, 'అగ్నిసాక్షిగా పెద్దల ఎదట జరిగే పెళ్ళి నాటకం అవుతుందా అని నాకు తాళి కట్టినవాడు ఎందుకు అడగ వలసి వచ్చిందో నాకప్పుడు అర్థం కాలేదు. కాని ఇప్పు డర్థమయింది. ఆ ప్రశ్నకు నా సమాధానం ఏమిటంటే, ఆ పెళ్ళి నాటకం కావటానికి వీల్లేదు. ఈ రాజకుమారుడికి నేను భార్యను కాను. చేతనైతే నా భర్తను తీసుకురండి. ఇతనితో నేను మటుకు కాపరం చెయ్యను,'' అన్నది.




తరవాత అనేక విషయాలు బయట పడ్డాయి. లంచం పెడితే పెళ్ళికొడుకు పరివారంలో వాళ్ళే అంతా చెప్పారు. అసలు పెళ్ళికొడుక్కు మూర్ఛలరోగం; దారిలో కనిపించిన కాశీ యాత్రికుడి చేత రాజకుమార్తెకు పుస్తె కట్టించారు!

పెళ్ళివారు అవమానం పొంది తమ దేశానికి తిరిగి వెళ్ళారు. పెళ్ళికూతురి తండ్రి అయిన రాజు తన నగరంలోని సత్రంలో, ''పెళ్ళిపీటల మీద పెళ్ళికొడుకు పెళ్ళికూతురితో ఏం చెప్పాడో తెలిసినవారికి బహుమానం ఇవ్వబడుతుంది,'' అని అందరికీ కనిపించేలాగ రాయించాడు. ఆ సమస్య ఎవరికీ అర్థం కూడా కాలేదు. చిరాయువు రాజకుమార్తెతో అన్న మాటలు రాజకుమార్తెకూ, ఆమె తండ్రికీ తప్ప మరెవరికీ తెలియవు.

ఆ మాటలు అన్న చిరాయువు తన నాటకపు పెళ్ళి మాటే మరిచిపోయి, కాశీ చేరి, విశ్వేశ్వరుడి సన్నిధిలో ధ్యానం చేస్తూ ఉండిపోయాడు. అతనికి ఇరవైఅయిదో ఏడు వచ్చింది, వెళ్ళిపోయింది కూడా. కాని అతనికి ఎలాటి ప్రాణ ప్రమాదమూ జరగలేదు. సాధ్యమైనంత త్వరగా ఇంటికి తిరిగి పోకపోతే తన తల్లిదండ్రులు తనకు తద్దినాలు పెట్టేస్తారని అతను ఇంటికి తిరుగు ప్రయాణమైనాడు.

దారిలో అతనికి తన మాయపెళ్ళి జరిగిన నగరం తగిలింది. తాను తాళిగట్టిన రాజకుమార్తె మరొకడి భార్య అయి ఈపాటికి పిల్లలతల్లి కూడా అయి ఉంటుందనుకుంటూ, ఆమె సమాచారం తెలుసుకోవాలనే కుతూహలంతో నగరం ప్రవేశించి, సత్రంలో దిగాడు. అక్కడ అతనికి రాజుగారి శాసనం కనిపించింది.

సత్రంలో వాళ్ళను అడిగితే రాజకుమార్తె ఇంకా తండ్రి వద్దనే ఉన్నదనీ, ఏ కారణం చేతనో ఆమె తాను పెళ్ళాడిన వాడితో కాపరానికి వెళ్ళలేదనీ, ఆ పెళ్ళి తరవాతనే రాజుగారు సత్రంలో ఈ శాసనం పెట్టించాడనీ అతనికి తెలిసింది.

చిరాయువు తిన్నగా రాజభవనానికి వెళ్ళి, "రాజుగారి నుంచి బహుమానం పుచ్చుకుందామని వచ్చాను. పెళ్ళి పీటల మీద వరుడు వధువుతో ఏమన్నాడో నాకు తెలుసును!" అన్నాడు.

ఈ మాట అతను అనగానే రాజభవనమంతా ఒక్కసారి మేలుకున్నట్టయింది. రాజగారూ, ఆయన కూతురూ చిరాయువును లోపలికి పిలిపించి, "వరుడు వధువుతో ఏమన్నాడు?" అని అడిగారు.

"అగ్నిసాక్షిగా పెద్దల ఎదట జరిగే పెళ్ళి నాటకం అవుతుందా అని వరుడు వధువును అడిగాడు. ఈ మాట చెప్పినందుకు నాకేం బహుమానం ఇస్తారు?" అన్నాడు చిరాయువు రాజకుమార్తెను చూసి చిరునవ్వు నవ్వుతూ.

అతనే తన కుమార్తె మెడలో తాళికట్టిన వాడని రాజుకు తోచింది. రాజకుమార్తె ముఖం చూస్తే అది రూఢి అయింది.

"ఏం బహుమానం ఇవ్వమంటావు? రాజకుమార్తె నిస్తాను!" అన్నాడు రాజు.

"మహాప్రసాదం!" అన్నాడు చిరాయువు.

రాజు చిరాయువుకు తన కుమార్తె నిచ్చి తిరిగి పెళ్ళి చేశాడు. ఆ పెళ్ళికి చిరాయువు తల్లిదండ్రులు వచ్చేశారు. పెళ్ళి వైభవంగా జరిగింది. చిరాయువు తన తల్లిదండ్రులతో మామగారి నగరంలోనే ఉండిపోయాడు.





# మహాభారతం

మైత్రేయుడు వెళ్ళిపోయాక ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కిమ్మీరవధ గురించి చెప్పమన్నాడు. విదురుడు ఆ వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు:

అరణ్యవాసానికి బయలుదేరిన పాండవులు మూడు రోజులు ప్రయాణం చేసి, అర్ధరాత్రివేళ కిమ్మీరవనంలో నుంచి పోతూ ఉండగా ఒక భయంకర రాక్షసుడు మెరిసే గుడ్లతో, నోరు తెరుచుకుని, చేతులు చాచి, వారి దారికి అడ్డంగా నిలిచి కనిపించాడు. వాడి ఎర్రని కనుగుడ్లూ, తెల్లని కోరపళ్ళూ, నెత్తిమీద బంగారం రంగులో నిక్క బొడుచుకుని ఉన్న వెంట్రుకలూ, నల్లని శరీరమూ భయంకరంగా ఉన్నాయి. వాడి రంకెలకు అరణ్యమృగాలు బెదిరి పారిపోతున్నాయి. వాడి చేతులో మండుతున్న కొరవి ఉన్నది.

పాండవులూ, వారివెంట ఉన్న ద్రౌపదీ, బ్రాహ్మణ బృందమూ ఆ రాక్షసుణ్ణి చూశారు. ద్రౌపది వాణ్ణి చూసి భయంతో కళ్ళు మూసుకున్నది. పాండవులు ఆమెకు ధైర్యం చెప్పసాగారు. ధౌమ్యుడు రాక్షసవినాశన మంత్రాలు చదవ నారంభించాడు.

ధర్మరాజు ఆ రాక్షసుడితో, "నువు ఎవడవు? ఈ వనంలో ఎందు కున్నావు?" అన్నాడు.

దానికి రాక్షసుడు, "నేను బకాసురుడి తమ్ముణ్ణి. నా పేరు కిమ్మీరుడు. ఈ కామ్యకవన మంతా నేను యథేచ్ఛగా సంచరిస్తూ ఉంటాను. మనుషులను చంపి తింటాను.

28. కిమ్మీర వధ



అందు చేత మనుషులెవరూ ఈ ప్రాంతాలకు రారు. మీ రిక్కడికి ఎందుకు వచ్చారు? వచ్చారు గనక మిమ్మల్ని అందర్నీ ఇప్పుడే తినేస్తాను," అన్నాడు.

ధర్మరాజు వాడితో, "మేము పాండవులం. నా పేరు ధర్మరాజు. వీళ్ళు నలుగురూ నా తమ్ములు. ఒక నియమానికి లోబడి మేము వనవాసం చెయ్యటానికి బయలు దేరి వస్తున్నాం." అన్నాడు.

కిమ్మీరుడిది విని, "ఎట్లాగూ? ఇతడేనా భీముడు? ఈ భీముణ్ణి చంపాలని చాలా కాలంగా ఎదురు చూస్తున్నాను. ఇవాళ నా పంట పండింది. ఇతను మా అన్నను బకుణ్ణి చంపాడు, నా స్నేహితుడైన హిడింబుణ్ణి చంపి, వాడి చెల్లెలు హిడింబను కాజేశాడు. ఈ దుర్మార్గుడు బుద్ధితక్కువతనం చేత మనుషులు ప్రవేశించ కూడని ఈ మహారణ్యంలోకి వచ్చి, నాకు దొరికాడు. ఇతని నెత్తురు బకహిడింబులకు తర్పణం చేస్తాను. మీ అందరి ఎదటనే ఈ దుర్మార్గుడి నెత్తురు తాగి, మాంసం తిని మాజాతి పగ తీర్చుకుంటాను," అన్నాడు.

ధర్మరాజుకు చాలా కోపం వచ్చి, "ఛీ, నోరు మూసుకో!" అన్నాడు. భీముడు ఒక చెట్టు పెరికి, కిమ్మీరుడి మీద కలియబడటానికి సిద్ధమయాడు. అర్జునుడు గాండీవానికి తాడు తగిలించి మీటి, బాణాలు సవరించాడు. భీముడు అర్జునుణ్ణి వారిస్తూ, "నువు ఆగు. ఈ దుర్మార్గుణ్ణి ఇప్పుడే యమపురానికి పంపేస్తాను," అంటూ తన చేతిలో ఉన్న చెట్టు కిమ్మీరుడి మీదికి విసిరాడు.

కిమ్మీరుడు ఆ దెబ్బకు అలిగి, తన చేతిలో ఉన్న కొరవి భీముడి పైన విసిరాడు. భీముడు దాన్ని ఎడమకాలితో నలిపేశాడు. తరవాత ఆ ఇద్దరూ చెరొక చెట్టూ పీకి కొట్లాడ నారంభించారు; తరవాత రాళ్ళతో ఒకరి నొకరు కొట్టుకున్నారు; చివరకు కలియబడ్డారు; ఒకరి నొకరు రక్కుకున్నారు, చాలా దారుణంగా పోట్లాడారు. చివరకు రాక్షసుడి బలం తగ్గిపోవటం గమ

నించి భీముడు వాణ్ణి చంకలో ఇరికించుకుని గిరగిరా తిప్పి, కింద పడేసి నడుముమీద కాలువేసి తొక్కి వాడి తలా, చేతులూ పట్టుకుని విరిచి చంపాడు. వాడు అతిదారుణంగా రంకెలు పెడుతూ చచ్చాడు. భీముడు వాడి శవాన్ని దూరంగా పారేశాడు. ఆ అరణ్యానికి వాడి పీడ లేకుండా చేశాడు. తరవాత ద్రౌపదీ, ధౌమ్యుడూ భీముణ్ణి ఎంతగానో అభినందించారు.

కిమ్మీరవధ ఇలా జరిగిందని విదురుడు చెప్పేసరికి ధృతరాష్ట్రుడు నిట్టూర్పులు విడుస్తూ, తలవంచుకుని విచారంలో మునిగిపోయాడు.

పాండవులు అధర్మమైన జూదంలో ఓడి అరణ్యాలలో ఉన్న మాట తెలిసి, యాదవులూ, పాంచాలులూ వారిని చూడవచ్చారు. యాదవులను వెంటబెట్టుకు వచ్చిన కృష్ణుడు కంట తడిపెట్టుకుని, క్రోధావేశంతో, "పాపాత్ములైన దుర్యోధన శకుని కర్ణుల రక్తంతో భూమి తడవాలి. అటువంటి అధర్మపరులను చంపటం ఉత్తమ ధర్మం. వారందరినీ ఒక్కపెట్టున చంపి, ధర్మరాజుకు రాజ్యాభిషేకం చేద్దాం," అన్నాడు.

ద్రౌపది తన వాళ్ళయిన ధృష్టద్యుమ్నుడు మొదలైన పాంచాలులను వెంట బెట్టుకుని కృష్ణుడి వద్దకు వచ్చి, తనకు కౌరవులు చేసిన పరాభవాలను చెప్పుకుని కుమిలి కుమిలి ఏడ్చింది.

కృష్ణుడు ఆమెను ఓదార్చుతూ, "ద్రౌపదీ, నిన్ను అవమానించిన ఆ దుర్మార్గులు





నశించి తీరుతారు. వారి భార్యలు ఇంకన్న మరింతగా దుఃఖసముద్రంలో మునుగుతారు. త్వరలోనే పాండవులు రాజాధిరాజులవుతారు. నువు వారిపట్టమహిషివి అవుతావు," అన్నాడు.

ద్రౌపదిని అర్జునుడూ, ధృష్టద్యుమ్నుడూ కూడా ఓదార్చారు.

తరవాత కృష్ణుడు ధర్మరాజుతో, "ఆ సమయంలో నేను ద్వారకలో ఉండినట్టయితే, పిలవని పేరంటంగానైనా మీరాడిన జూదం చూడటానికి వచ్చి, సహాయపడి ఉండే వాణ్ణి. అసలు నేనుంటే ఆ జూదం జరిగేది కాదు. దుర్యోధనుడు జూదం మానకపోతే అక్కడే వాడికి శాస్తి చేసి ఉండేవాణ్ణి. నేను ద్వారకకు తిరిగి రాగానే యుయుధానుడు నాకు మీ విషయాలన్నీ చెప్పాడు. వెంటనే మిమ్మల్ని చూడటానికి బయలుదేరి వచ్చాను," అన్నాడు.

"ఆ రోజులలో నువు ద్వారకలో ఎందుకు లేవు? ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగాడు ధర్మరాజు.

"రాజసూయయాగ మప్పుడు శిశుపాలుణ్ణి నేను చంపానని నా మీద అతని తమ్ముడు సాళ్వుడు పగపట్టాడు. వాడుండే సౌభనగరం మీదికి యుద్ధానికి వెళ్ళాను," అని కృష్ణుడు ఆ కథ అంతా ఈ విధంగా చెప్పాడు:

కృష్ణుడు రాజసూయయాగ మప్పుడు శిశుపాలుణ్ణి చంపాడన్నది సాళ్వుడికి తెలియగానే, అతను సౌభ మనే విమానం మీద ద్వారక పైకి వచ్చి దాడి చేశాడు. అప్పుడు కృష్ణుడింకా ఇంద్రప్రస్థంలోనే ఉన్నాడు. అందు చేత, తమ నగరాన్ని ముట్టడించిన సాళ్వుడితో యుద్ధం చెయ్యటానికి ఉగ్రసేనుడు సన్నాహాలు చేసి, దుర్గరక్షణకుగాను శూరులను నియమించి, యుద్ధం చెయ్యటానికి గదుడూ, సాంబుడూ మొదలైన వారిని పంపాడు. యుద్ధం జరిగింది. అందులో ప్రద్యుమ్నుడు గొప్ప పరాక్రమం చూపి, సాళ్వుడి సేనలను చిందర వందర చేశాడు.

ఇంతలో కృష్ణుడు ఇంద్రప్రస్థం నుంచి ద్వారకకు తిరిగి వచ్చాడు. జరిగిన సంగతి విని అతను, సాళ్వుణ్ణి చంపిగాని ద్వారకలో అడుగుపెట్టనని శపథం చేసి, యుద్ధ సన్నద్ధుడై బయలుదేరాడు. ఈ సంగతి తెలిసి సాళ్వుడు తన సౌభ విమానంమీద సముద్ర తీరానికి పారిపోయాడు. కృష్ణుడు వాణ్ణి తరుముతూ వెళ్ళాడు.

సాళ్వుడు తన విమానాన్ని సముద్రానికి ఎగువగా ఆకాశంలో నిలిపి, నవ్వుతూ కృష్ణుణ్ణి యుద్ధానికి ఆహ్వానించాడు.

కృష్ణుడు సాళ్వుడిపై వేసిన బాణం ఒక్కటీ తగల లేదు, కాని వాడువేసే బాణాలు కృష్ణుడి సేనమీద వర్షంలాగా వచ్చి పడ్డాయి. ఇది చూసి విమానంలో ఉన్న సాళ్వుడి అనుచరులు చప్పట్లు కొట్టారు. ఆ ధ్వనిని బట్టి కృష్ణుడు బాణాలు వేసి కొందరిని చంపగలిగాడు. కాని విమానం సహాయంతో సాళ్వుడు మాయాయుద్ధం జయప్రదంగా సాగించాడు. కృష్ణుడి సారథి అయిన దారుకుడికి కూడా తమకు విజయం కలగదని సందేహం కలిగింది.

ఈ దారుణపరిస్థితిలో కృష్ణుడున్న చోటికి కృతవర్మ పంపిన దూత ఒకడు వచ్చి, సాళ్వుడు అదృశ్యంగా ద్వారక ప్రవేశించి, కృష్ణుడి తండ్రి అయిన వసుదేవుణ్ణి చంపేసి నటు వార్తతెచ్చాడు. కృష్ణుడీ వార్తను ఎలా



నమ్మటమా అని ఆలోచిస్తూ ఉండగా వసుదేవుడి శవం ఆకాశం నుంచి కింద పడటం అతనికి కనిపించింది. వెంటనే కృష్ణుడు నీరసించి, రథంలో ఒక పక్కకు ఒరిగిపోయాడు. అతని చేతినుంచి విల్లు జారిపడిపోయింది. కృష్ణుడి సేనలో హహా కారాలుపుట్టాయి.

ఇదంతా సాళ్వుడి మాయ అని కృష్ణుడు గ్రహించటానికి కొంత సేపు పట్టింది. సాళ్వుడి మాయలన్నీ అర్థం చేసుకుంటూ కృష్ణుడు చాలా దీర్ఘమైన యుద్ధం చేసి, చిట్టచివరకు తన చక్రాయుధం ప్రయోగించి, సాళ్వుడి విమానాన్నీ, సాళ్వుణ్ణీ, అందులో ఉన్న వారందరినీ నాశనం చేశాడు. కృష్ణుడు



ఈ యుద్ధంలో జయించి ద్వారకకు తిరిగి వచ్చేసరికి, పాండవులు అరణ్యాలకు వెళ్లిన వార్త తెలిసింది. వెంటనే అతను పాండవులను చూడవచ్చాడు.

పాండవులను చూడవచ్చిన యాదవులూ, పాంచాలులూ, కైకేయులూ తిరిగి వెళ్ళి పోయారు.

పాండవులు వనవాసం చేస్తూ, రాగల యుద్ధం గురించి ఆలోచనలు చేశారు. ఒక నాడు ధర్మరాజు అర్జునుడితో, "అర్జునా, పూర్వం వృత్రాసురుడి దెబ్బకు తట్టుకోలేక దేవతలందరూ తమతమ అస్త్రాలను ఇంద్రుడి వద్ద ఉంచారు. ప్రతిస్మృతి అనే విద్యను వ్యాసమహాముని నాకు చెప్పాడు. నువు దానిద్వారా ఇంద్రుణ్ణి మెప్పించి ఆ అస్త్రాలను సంపాదించుకురా. రేపు దుర్యోధనుడి పక్షాన భీష్మ, ద్రోణ, కర్ణాదులు నిలిచి యుద్ధం చేస్తారు. వారిని గెలవటం ఎలాగా అని నేను ఆలోచిస్తూ ఉంటే వ్యాసమహాముని ప్రత్యక్షమై నాకు ప్రతిస్మృతి అనే విద్య ప్రసాదించి, దానిని నీ కివ్వమన్నాడు. నా నుంచి దాన్ని నువు తీసుకుని పునశ్చరణ చేసి, ఇవాళే ఉత్తరంగా బయలుదేరి వెళ్ళు," అన్నాడు.

అర్జునుడు ధర్మరాజు నుంచి ప్రతిస్మృతి గ్రహించి, అగ్నిని ఆరాధించి ప్రదక్షిణం చేసి, కవచమూ, గాండీవమూ, అక్షయతూణీరాలూ ధరించి, ధౌమ్యుడికీ, ధర్మరాజుకూ ప్రదక్షిణ నమస్కారాలు చేసి, సెలవు పుచ్చుకుని బయలుదేరాడు.

ద్రౌపది అతన్ని సాగనంపటానికి కొంత దూరం వెంట వచ్చి, "నువు వెళ్ళేపని సఫలం అగుగాక. నువు లేనిలోటు మమ్మల్నందరినీ బాధిస్తుంది. నీ క్షేమం కోరుతూ, నీ రాకకోసం ఎదురు చూస్తూ ఉంటాం. మా కష్టసుఖాలన్నీ నీ మీదే ఆధారపడి ఉన్నాయి. విఘ్నాలు లేకుండా వెళ్ళినపని చేసుకురా," అన్నది.

అర్జునుడు అరణ్యాల వెంబడి ప్రయాణం చేస్తూ దారిలో తగిలిన హిమాలయాన్నీ, గంధమాదన పర్వతాన్నీ దాటి, ఇంద్ర

కీలాద్రి చేరాడు. అతను అతివేగంగా ముందుకు సాగిపోతూండగా, "ఆగు!" అన్నమాట వినిపించింది.

ఆ నిర్జన ప్రదేశంలో ఎవరు మాట్లాడారా అని అర్జునుడు చుట్టూ కలయజూసే సరికి, ఒక చెట్టు నీడను ఒక తపస్వి కనిపించాడు. ఆయన పింగళవర్ణదేహం కలిగి, బక్క చిక్కి కూడా బ్రహ్మతేజస్సుతో వెలుగుతున్నాడు.

అర్జునుడు ఆయన వద్దకు వెళ్ళి నిలబడ్డాడు.

"నాయనా, నువ్వెవరు? యుద్ధానికి వెళ్ళేవాడిలాగా కవచమూ, ఆయుధాలూ ధరించి ఈ వనంలో ఎందుకు తిరుగుతున్నావు? ఇక్కడ గొప్ప గొప్ప తపస్వులు, ఇంద్రియాలను జయించినవారు ఉంటారు. ఇలాటి చోట ఈ ఆయుధాలెందుకు? అందుచేత వీటిని అవతల పారెయ్యి." అన్నాడు ఆ తస్వి.

అర్జునుడు అందుకు సమ్మతించ లేదు. తపస్వి ఎంత చెప్పి కూడా ప్రయోజనం లేకపోయింది. అప్పుడా తపస్వి, "నాయనా, నీ పట్టుదలకు సంతోషించాను. నేను ఇంద్రుణ్ణి. ఏం వరం కోరుతావో కోరుకో!" అన్నాడు.

అర్జునుడు ఇంద్రుడికి నమస్కారం చేసి, "దేవా, నాకు దివ్యాస్త్రాలన్నీ ప్రసాదించు," అన్నాడు.

దానికి ఇంద్రుడు, "వెర్రివాడా, నీ కిక అస్త్రాలెందుకు? పుణ్యలోకాలే ఇస్తాను. హాయిగా సుఖించు," అన్నాడు.

"మా అన్నలూ, తమ్ములూ అరణ్యాలలో పడరానిపాట్లు పడుతూ ఉంటే, నేనొక్కణ్ణీ సుఖించనా? నా వల్ల కాదు. నేను క్షత్రియుణ్ణి. చచ్చిన తరవాత కూడా, నా కీర్తి నిలిచి ఉండాలి. అంతేగాని సుఖంకోసం అపకీర్తి పాలుకాలేను," అన్నాడు అర్జునుడు.

ఇంద్రుడు అర్జునుడి మంచితనాన్ని మెచ్చుకుని, "నాయనా, నీ కోరిక నెరవేరాలంటే నీకు ముందు శివుడి దర్శనం కావాలి. వెళ్ళి ఆయన దర్శనం చేసుకో," అని చెప్పి అంతర్ధానమయాడు.





# శివపురాణం

## 5

హిమవంతుడు భార్యా సహితంగా శివుడికి సాష్టాంగ నమస్కారం చేసి, పూలూ, చందనమూ మొదలైనవి సమర్పించి, చేతులు జోడించుకుని నిలబడ్డాడు. శివుడు కళ్ళు తెరిచి చూసి, "హిమవంతుడా, నువు మహాపవిత్రుడవు. అందుచేతనే నీకు చెందిన ఈ కైలాసశిఖరాన తపస్సు చేసుకుంటున్నాను," అన్నాడు.

"మహాత్మా, నువు ఇక్కడ తపస్సు చేసుకోవటం నా భాగ్యం. ఇక్కడ తపస్సు చేసుకుంటున్న నీకు ఎలాటి విఘ్నమూ కలగకుండా నేను చూస్తూనే ఉన్నాను," అన్నాడు హిమవంతుడు.

శివుడు సంతోషించి, హిమవంతుణ్ణి ఏదన్నా వరం కోరుకోమన్నాడు.

"నా కుమార్తె పార్వతి నీకు పరిచర్యలు చెయ్యటానికి ఉత్సాహపడుతున్నది. ఆమె అలా చేయటానకి అనుమతించు," అన్నాడు హిమవంతుడు.

"తపస్సు చేసుకునే వారికి స్త్రీల పరిచర్యలు తగవు. కావాలంటే నువు వచ్చి పరిచర్యలు చేసి వెళుతూ ఉండు," అన్నాడు శివుడు.

"నా కుమార్తె కన్యక. మహాదేవి వరాన పుట్టింది. నీ వంటి విరాగికి ఆమెవల్ల తపోభంగం ఎలా కలుగుతుంది? నా కోరికను మన్నించి, నా కుమార్తె పరిచర్యలు స్వీకరించు," అన్నాడు హిమవంతుడు.

శివుడు సరేనన్నాడు.

సతీదేవి పోయాక శివుడు కైలాసపర్వతానికి వచ్చి తపస్సు ప్రారంభించిన తరవాత ఒకసారి శివుడి తపస్సుయొక్క వేడికి ఆయన నుదుటి నుంచి ఒక చెమట బిందువు భూమి మీద పడింది. అప్పుడా బిందువు

అట్ట చివరి బొమ్మ



నుంచి ఒక కుమారుడు పుట్టాడు. అతను ఆజానుబాహువు, ఎర్రని శరీరచ్ఛాయ గలవాడు, స్థూలకాయుడు. భూదేవి ఆ కుమారుణ్ణి ఎత్తుకుని శివుడి వద్దకు తెచ్చి చూపింది.

శివుడు భూదేవిని చూసి, "నువు ధన్యురాలవు. నా చెమట నుంచి పుట్టిన ఈ కుమారుడు భౌము డనే పేరుతో నీకు కీర్తి తెస్తాడు," అన్నాడు.

భౌముడు పెరిగి పెద్దవాడై, కాశీపట్టణం చేరి, అక్కడ ఈశ్వరుణ్ణి గురించి ఘోర తపస్సు చేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై భౌముడికి గ్రహమండలంలో స్థానం కలిగించాడు. ఆ భౌముడికే కుజు డనీ, అంగారకు డనీ కూడా పేర్లు వచ్చాయి.

శివుడు తపస్సు చేసుకునే కాలంలోనే గంగ భూమికి అవతరించింది. భూలోకంలో నీరు లేదని ఋషులూ, పితృదేవతలూ మొరపెట్టుకోగా, బ్రహ్మ తన కమండలం లోనుంచి ఒక నీటిబిందువును వదిలాడు. అది మహా ప్రవాహమై భూమి కేసి రాసాగింది. దానివల్ల భూలోకానికి కలిగే అపాయం గ్రహించి శివుడు ఆ ప్రవాహాన్ని తన జటాజూటంలో బంధించి, ఒక్క బొట్టును మానససరోవరంలోకి వదిలి, తిరిగి తపస్సు ప్రారంభించాడు.

ఈ సంగతి ఇలా ఉండగా, దక్షుడి కుమార్తెలలో ఒకతె అయి, కశ్యపుడి రెండవ భార్య అయిన దితి హిరణ్యకశిపుణ్ణీ, హిరణ్యాక్షుణ్ణీ కనటమూ, వాళ్ళు మహా బలవంతులూ, క్రూరులూ అయి లోకాలన్నిటినీ పీడించటమూ, విష్ణువు వరాహ, నారసింహావతారాలెత్తి వారిని చంపటమూ జరిగింది. పుత్రశోకంతో కుములిపోయే దితి కశ్యపుడి అనుగ్రహంతో మళ్ళీ గర్భం ధరించింది. తనకు మరొక ప్రబల విరోధి పుట్టబోతాడని భయపడి ఇంద్రుడు ఆమె గర్భంలోని పిండాన్ని తన వజ్రాయుధంతో ముక్కలు ముక్కలుగా నరికాడు. అయితే కశ్యపుడి అనుగ్రహం చేత పిండ ఖండాలు చావక, దితి కడుపున మరుత్తులుగా పుట్టి, ఇంద్రుణ్ణి సేవించటానికి వెళ్ళిపోయారు.

దితి నిరాశ చెంది తనకు పుత్రదానం చెయ్యమని కశ్యపుణ్ణి తిరిగి ప్రార్థించింది. బ్రహ్మను గురించి కొంతకాలం తపస్సు చెయ్యమని కశ్యపుడు ఆమెకు సలహా ఇచ్చాడు. దితి అలాగే చేసి, అనంతరం కశ్యపుడి అనుగ్రహంతో వజ్రకాయుడైన ఒక కొడుకును కన్నది. వాడి వజ్రకాయం చూసి తలిదండ్రులు వాడికి వజ్రాంగుడని పేరు పెట్టారు.

వజ్రకాయుడు పుట్టినప్పుడు ఉల్కాపాతాలూ, భూకంపాలూ, తుపాను గాలులూ కలిగాయి. దేవతలు భయపడ్డారు. దితి వజ్రాంగుణ్ణి చాలా గారాబంగా పెంచి పెద్దవాణ్ణి చేసి, "నాయనా, దేవతలు నాకు ఎంతో శోకం కలిగించారు. వాళ్ళు, నీ అన్నలైన హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను విష్ణువు చేత చంపించారు. మరుత్తులు నా గర్భంలో ఉండగా ఇంద్రుడు నా గర్భాన్ని నరికాడు. నువు దేవతల మీద యుద్ధం చేసి నా పగ తీర్చు," అన్నది.

తల్లి ఇలా అన్నమీదట వజ్రాంగుడు రాక్షససేనలను చేర్చి, రణభేరీ వేయించి, దేవేంద్రుడి పట్టణాన్ని ముట్టడించి, దేవతలను చావగొట్టి, దేవేంద్రుణ్ణి బందీగా చేసుకుని స్వర్గాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఈ వార్త విని పరమానందభరితురాలయింది దితి.



దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్ళి తమ అపజయాన్ని గురించి చెప్పుకున్నారు. బ్రహ్మ అంతా విని, కశ్యపుడితోసహా వజ్రాంగుడి వద్దకు వెళ్ళి, అతడికి మంచి మాటలు చెప్పి, ఇంద్రుణ్ణి విడిచిపుచ్చమనీ, స్వర్గాన్ని దేవతలకు తిరిగి ఇవ్వమనీ హితబోధ చేశాడు.

"నేను రాజ్యంకోసమూ, ధనంకోసమూ దేవతలతో యుద్ధం చెయ్యలేదు ఈ దేవేంద్రుడు దుర్మార్గుడు. వీడు నా తల్లి మనసు క్షోభ పెట్టాడు. ఆమె గర్భాన్ని ఖండాలుగా కోశాడు. వీడు విడిచిపుచ్చ దగినవాడు కాడు. అయినా మీరు చెప్పారు గనక విడిచిపుచ్చుతున్నాను. వీడు నా తల్లిని క్షోభ

పెట్టకపోతే నా వల్ల క్షోభపడి ఉండడు,'' అన్నాడు వజ్రాంగుడు.

ఈ మాటకు బ్రహ్మ ఎంతో సంతోషించి, వజ్రాంగుణ్ణి వరం కోరుకోమన్నాడు.

"నాకు పరబ్రహ్మస్వరూపమూ, భూత దయా తప్ప ఇంకేమీ అక్కర్లేదు. అవి రెండూ నాకు అనుగ్రహించండి,'' అన్నాడు వజ్రాంగుడు.

బ్రహ్మ మరింతగా సంతోషించి, వరాంగి అనే సౌందర్యవతి అయిన కన్యను వజ్రాంగుడికి భార్యగా ఇచ్చి వివాహం చేసి, కశ్యపుడు మొదలైన వారితోసహా వెళ్ళిపోయాడు. వజ్రాంగుడు శివభక్తుడై, సాత్వికస్వభావుడై, తన పట్టణానికి తిరిగి వచ్చి ఈశ్వరపూజ చేస్తూ జీవించసాగాడు.

కొంతకాలం గడిచింది. తన భార్య చేసే సేవలకు సంతోషించి వజ్రాంగుడు వరాంగితో, "నీకేం వరం కావాలో కోరు,'' అన్నాడు.

"మహా బలపరాక్రమవంతుడూ, దేవేంద్రుణ్ణీ, దేవతలనూ జయించగలవాడూ, ప్రపంచంలో తన కీర్తి శాశ్వతంగా నిలుపుకో గలవాడూ అయిన కొడుకు కావాలి,'' అన్నది వరాంగి.

భార్య ఇలా అనగానే వజ్రాంగుడు నొచ్చుకున్నాడు. వరాంగి స్త్రీ సహజమైన చపల చిత్తంతో దేవతా విరోధి అయిన కొడుకును కోరింది. అలాటివాణ్ణి విష్ణువు ఎంతోకాలం బతక నివ్వడు. అయితే వజ్రాంగుడికి మాట తప్పటం ఇష్టం లేదు. అందుచేత అతను బ్రహ్మను గురించి చాలాకాలం ఘోర తపస్సు చేశాడు.

బ్రహ్మ ప్రత్యక్షమై, "నీ తపస్సుకు మెచ్చాను. ఏం వరం కావాలో కోరుకో,'' అని వజ్రాంగుడితో అన్నాడు.

"మహాత్మా, నా భార్య దేవతలను జయించగల కొడుకును కోరుతున్నది. ఆమెకు అలాటి కొడుకు కలిగేలాగు వరం ఇయ్యి,'' అన్నాడు వజ్రాంగుడు.

అతను కోరిన వరం ఇచ్చి బ్రహ్మ అంతర్ధాన మయాడు. వజ్రాంగుడు ఇంటికి తిరిగి వచ్చి, భార్యతో ఆమె కోరిక తీరుతుందని చెప్పాడు.



# 115. మిలాన్ చర్చి

ప్రపంచంలోని పెద్ద చర్చిలలో ఇది రెండవది. (ఇంత కన్న పెద్ద చర్చి రోము నగరంలోని సెంట్ పీటర్ చర్చి మాత్రమే.) అచ్చుగా చలవరాతితో కట్టిన ఈ మిలాన్ చర్చి ప్రపంచపు ప్రఖ్యాత వింతలలో ఒకటిగా ఎంచబడుతున్నది. దీని నిర్మాణం క్రి. శ. 1386లో ప్రారంభమై 1805 దాకా జరుగుతూనే వచ్చింది. దీని నిడివి 486 అడుగులు, వెడల్పు 289 అడుగులు. దీనిలోని మధ్య గోపురంలో "వర్జిన్" (క్రీస్తు తల్లి) విగ్రహం ఉన్నది. ఇది నేల మట్టానికి 354 అడుగుల ఎత్తున ఉన్నది. ఈ చర్చి పై భాగంలో 135 గాలిగోపురాలు ఉన్నాయి. ఇవి స్వర్గాన్ని చూపిస్తున్నా యంటారు. రెండవ ప్రపంచయుద్ధ మప్పుడు ఇటలీలోని ఇతర నగరాలతోబాటు మిలాన్ నగరం కూడా తీవ్రమైన బాంబుల దాడికి గురిఅయింది.



Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

తొండ రెక్కెవ

పంపినవారు:
జి. రవీంద్రకుమార్, కాకినాడ

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

తిండి తక్కువ

పంపినవారు:
జి. రవీంద్రకుమార్, కాకినాడ

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 ఆగస్టు నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి అయిన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తొంద రెక్కువ

రెండవ ఫోటో : తిండి తక్కువ

పంపినవారు : జి. రవీంద్రకుమార్,

పాన్టర్‌పేట, కాకినాడ—2

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

# వనమూలికల నుండి తయారైన

# ఆవు గుర్తు




# బ్రాహ్మీ ఆమ్లా హెయిర్ ఆయిల్

# పళ్లపొడి

పైన చెప్పబడిన ఈ ఉత్పత్తులు హెయిర్ ఆయిల్ మరియు పండ్ల పొడి మాత్రమే కాదు. అవి ఆయుర్వేద ఔషధములు కూడా.

## ఆయుర్వేద సేవాశ్రమ్ ప్రైవేట్ లిమిటెడ్

ఉదయపూర్ • వారణాసి • హైదరాబాద్

heros-AS 95 TEL




నములండి

# చిక్లెట్స్ చూయింగ్ గమ్,

## తెలుసుకోండి వాటి మజా

ఊరూర తిరుగుతూ తెచ్చాడు చిక్లెట్స్ బఫూన్
మీ లాంటి పిల్లలకు చిక్లెట్స్ చూయింగ్ గమ్
మీరు ఎరుగని నాల్గు క్రొత్త చూయింగ్ గమ్ రుచులతో
ఆరంజ్, లెమన్, పెప్పర్‌మింట్, టూటి-ఫ్రూటి.

# ఈమె జానకి

ఇద్దరు పిల్లల తల్లి • ఎప్పుడూ ఏదో పని చేస్తూనే వుంటుంది.



## "అదే, అసలైనదే నాకు కావాలి!"

జానకికి ఇంటి పని ఎక్కువ. ఓర్పు పొందే శక్తి ఉత్సాహముల కోసం ఆమె రోజూ "హార్లిక్స్" త్రాగుతుంది.

"హార్లిక్స్"లో పోషకవంతమగు పదార్థములు, శక్తి నిచ్చే ప్రోటీన్లు వున్నాయి.

"హార్లిక్స్"లో శుద్ధమైన, పూర్తి మీగడ గల పాలు, ఉత్తమమైన గోధుమ మరియు ఇతర పోషకవంతమైన పదార్థములు వున్నాయి. డాక్టర్లు, 80 సంవత్సరముల పైగా "హార్లిక్స్"ను సిఫారసు చేస్తున్నారు. మీరు, మీ కుటుంబములోని వారు శక్తి ఉత్సాహములతో వుండుటకు ప్రతి రోజు "హార్లిక్స్" త్రాగండి.

"హార్లిక్స్" ఉత్తమ పోషకత్వమును, అధిక శక్తిని ఇస్తుంది.




### అదే, అసలైనదే 'హార్లిక్స్'

"హార్లిక్స్" అనే పేరు రిజిస్టర్ చేయబడిన ట్రేడ్ మార్కు.

HL-1045 A

# ఇంకో ప్యారీ మిఠాయి తినాలని ఆశ!




పిల్లలు ప్యారీ మిఠాయిలు ఎప్పుడూ కావాలనే
అంటూ వుంటారు. పిల్లలు అతివేగంగా కోల్పోయే
శక్తిని ప్యారీ మిఠాయిలు, భర్తీ చేస్తాయి.
ప్యారీ మిఠాయిలు తాజాయైనవి, పుష్టికరమైనవి,
చప్పరించకుండా వుండలేనంత రుచికరమైనవి.

తయారుచేయువారు: ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

PRS-6397

